అంకితము

# శ్రీ తారకం గారికి

‘ఆ హృదయమందు కలదు మార్గదర్శనంబు’

# పండితజీ

శ్రీ శరచ్చంద్ర విరచితము

తలావజ్ఝల
కృత్తివాస తీర్థులు

అనువదించినది

. రాతువారు .
రాజమహేంద్రవరము

# పండితజీ

## [ ౧ ]

వైష్ణవకుంజుని చెల్లెలు కుసుమబాల్యచరిత్రము బాగా లేకపోవడంవల్ల కొద్దిగా జ్ఞాపకం వచ్చినంతమాత్రానే దుఃఖంతోనూ లజ్జతోనూ ముఖాన్ని మాటుచేసు కొంటుంది. ఆమెకు రెండేళ్ళప్పుడు తండ్రి చనిపోయాడు. నాటినుంచీ తల్లి బిచ్చమెత్తి కొడుకునూ కూతుర్నీ పోషించేది. అయిదేళ్ళవయస్సులో 'బాడల' గ్రామంలోకల్లా ధనికుడు గౌరవదాసు ఈపిల్లచక్కదనం చూచి తనకొడుకు బృందావనుకు భార్యగా తగు నని ఊహించి పెళ్ళి చేశాడు. వివాహం అయిన కొద్దిరోజులకే కుసుమతల్లినడవడి చెడ్డ దనేవార్త ఆనోటా ఆనోటా పడింది. ఇదే కారణంవల్ల గౌరవదాసు కుసుమను వదిలేసి కుమారుడికి రెండోపెళ్ళి చేశాడు. కుసుమ జనని పేదరాలు అయినకూడా చాలా అభిమానవతి. ఆమెకూడా కోపంతో తనపిల్లను మరోచోటికి తీసుకుపోయి, అదేనెలలో ఇంకో 'అసలు వైరాగి'తో రెండోపెళ్ళికి కావలసినపనులు చేసింది. అయితే ఆరునెలల్లోనే 'అసలు వైరాగీరాంజీ' చనిపోయినాడు. అయినా కుసుమతల్లికి తప్ప ఇంకెవరికీ వా రెవరో ఏవూరివారో తెలియదు. కారణం ఆమె వెంట మ రెవ్వరినీ తీసుకుపోలేదు కుంజుడికి కూడా ఈ విషయం గుప్తంగానే ఉండిపోయింది.

నిజంగా కుసుమకు బైరాగితో రెండో పెళ్ళి అయిందో లేదో, ఇదంతా లోకులు వేసినఅపవాదో సరిగా ఎవరూ చెప్పగలిగేవారు కారు. ఇన్ని పనులూ కుసుమకు ఏడేళ్ళునిండక మునుపే జరిగి పోయినవి. అప్పణ్ణించీ కుసుమ వితంతువు.

ఇప్పుడు ఆమెకు పదహారేళ్ళ నిండుయౌవనం. ఆమెశరీరంలో సౌందర్యం తొణికిసలాడుతూ వుంటుంది. గుణంకూడా ఆమెలో నిండుగాఉండేది. పనిపాటల్లో నేర్పరి. ఆమెకు వ్రాయడం చదవడంకూడా చేతనవును. ఆమెఎంతగొప్పఇంటికయినా ఇల్లాలు కా తగనిదని ఎవ్వరూ అనలేరు.

ఇటు బృందావనతండ్రీ, భార్యాకూడా గతించారు. ఇప్పడతనికి పాతికేళ్ళు మించలేదు. మళ్ళీ అతను కుసుమను చేపట్టా లనుకొంటున్నాడు. ఆమెకు య్యాభైరూపాయల రొక్కం, అయిదు జతల చీరలు, అయిదుతులాల బంగారం, నూరు తులాల వెండీ పెట్టదలచుకున్నాడు.

బీదవాడు కుంజనాథుడు ఆశపడ్డాడు, కుసుమ వొప్పుకుంటే బాగుంటుం దని కాని ఈమాటలు ఆమె చెవి కెక్క లేదు.

తల్లీ తండ్రీ పోయినప్పణ్ణించీ అన్నా చెల్లెలూ బ్రాహ్మణ వీధిలోనే పూరింట్లో ఉంటున్నారు. పసితనంనుంచీ కుసుమ బ్రాహ్మణపిల్లలతోనే ఆడుతూ పాడుతూ ఉండి వాళ్ళతో పాటే పెద్ద దయింది. వాళ్ళతో కలిసి మెలిసి 'వారపండితు'ని పాఠశాలలో చదువుకొన్నది. తనస్థితిగతులు తలుచుకుంటే ఆమె సిగ్గుతో చచ్చిపోయేది. వంగదేశంలో మాలేరియా కల రాల ప్రసాదంవల్ల స్త్రీలు వితంతువులు కావడానికి ఆలస్యం

లేదు. ఆమెబాల్యసఖులలో చాలామంది, ఆమెలాగే గాజులు పగలగొట్టుకొని కుంకుమబొట్టు చెరుపుకొని తిరిగి పుట్టిళ్ళకు చేరుకొన్నారు.

"ఛీ ఛీ! ఒకవేళ అన్నయ్యమాట వింటే ...వూరువాళ్ళకు నే నేమొహంతో కనపడను!" అన్నది కుసుమ.

కుంజనాథుడు అన్నాడు "చెల్లీ, నీవు నామాట విను. నిజం చెప్పవలసి వస్తే బృందావనే అసలుభర్త." కుసుమ అలిగి ప్రత్యుత్తరం ఇచ్చింది. "నాకు అస లేదో నక లేదో తెలియదు. విధవ ననిమాత్రం తెలుసు. నేను పశువులా ఇష్టం వచ్చినట్టు చేస్తా ననుకున్నావా? ఒకటికి రెండుపెళ్ళిళ్ళు అయినాయి. తిరిగీ ఇంకోటా! పో ఇలాంటి మాటలు నాదగ్గర మాట్లాడకు. నాభర్త పోయాడు. నేను విధవను. శాడల గ్రామస్థులు నాకేమి అయినవాళ్ళు కారు."

పాపం, కుంజనాథుడు ఇం కేమీ మాట్లాడ లేకపోయాడు. తెలివితేట లున్నచెల్లెలిముందు అతడు దమ్మిడీకి పనికి రాడు. అయినా అతను మరోవిధంగా ఆలోచిస్తాడు. రెండు కుటీరాలు వాటిని అనుకొన్న మామిడిచెట్లూ పనసచెట్లూ, చిన్న పెరడూ తప్ప తన కే ముంది? అదీ గాక ఇన్నిరూపాయలు పంచలు శాలువలు అతనికి సాధారణవస్తువులు కావు. ఈ ఒక్క ఆశా వదిలేస్తే అతనికి తనచెల్లెలు సుస్థానంలో సుఖంగా వుంటే చూడా లనే వుంది. వారికులంలో రెండో పెళ్ళి చేసేఆచారం ఉంది. అందువల్లనే తల్లి ఆశాస్తసంస్కారం చేసిపోయింది. కాని కుసుమ తనభర్త ఒక్కటేదిగా బతిమాలుతోంటే ఆ

సుయోగాన్ని ఎందుకు వదులుకొంటున్నదో కుంజనాథుడికి బొత్తిగా అర్థం కాలేదు.

"ఆమె భర్తకేసి ఒక్కసారైనా ఎందుకు చూడదు? కులానికి కొద్దిగా ముడుపు చెల్లిస్తే చాలు. అదేం పెద్దఘోరంగా చంపుడానికి? ఖర్చంతా బృందావనే భరిస్తాడు. తరవాత రాణీలాగ ఉండవచ్చు. కుసుమ ఎంతమూర్ఖురాలు!"

రోజూ కుంజనాథుడు ఇలాగే ఆలోచిస్తూండేవాడు. అతనికి చిల్లరవ్యాపారమే బతుకు తెరువు. మూటలో పిల్లలాడుకునే వస్తువులు పూసలూ మిఠాయిలు వేసుకుని ఊరూరా తిరిగి అమ్ముకుని వస్తుండేవాడు. పగలల్లా తిరిగి తిరిగి సంపాదించి తెచ్చిన డబ్బులిచ్చాక చెల్లెలు ఇల్లు ఎలా చక్కబెడుతున్నదో యోచించే అవసరం అతనికి లేకపోయేది. ఇవాళ ఉదయాన్నే లేచి దిమ్మతిరిగి అతను బాడల గ్రామం చేరుకున్నాడు. తోవలో బృందావను కనిపించాడు. ఏదో పనిమీద వెడుతూన్న బృందావన్ కుంజన్ని చూడగానే వెనక్కుతిరిగి ఆప్యాయంగా ఇంటికి తీసుకుపోయాడు. కాళ్ళూ చేతులూ కడుక్కోడానికి నీళ్ళిచ్చి, చిలుంలో పొగాకు నింపి మర్యాద చేశాడు. రెండుఝాములప్పుడు బృందావనుతల్లి రకరకాల పిండి వంటలు చేసి పెట్టి చల్లపడిందాకా అతన్ని కదలనీయ లేదు. సాయంకాలం కుంజనాథుడు ఇంటికి వచ్చి కాళ్ళూచేతులు కడుక్కొని శనగలు నములుతూ, పగలు జరిగిన సంగతంతా వినిపించాడు. చివరకు వాళ్ళు మంచికుటుంబీకులు అని కూడా చెప్పాడు. తోట దొడ్డి చెరువూ చేనూ మొదలయినవాటి కేమీ కొదవ లేదు. వారింట్లో లక్ష్మి తాండవ మాడుతూ

వుంటుంది. కుసుమ నిశ్శబ్దంగా విని ఏమీ సమాధానం చెప్ప లేదు. కుంజనాథు డిదొకశుభలక్షణంగా ఊహించి విస్తరించి బృందావనుతల్లి మంచిమంచి పిండివంటలు ఎలాచేసి పెట్టిందీ, ఎంత ఆదరంగా కొసరికొసరి వడ్డించిందీ చెప్పాతూ ఇంతఎండలో వెడితే తలనొప్పి వస్తుంది అన్నది అని చెప్పినాడు.

కుసుమ అన్నను చూసి నవ్వుతూ "అయితే నువ్వీవేళల్లా ఈపనుల్లోనే మునిగిఉన్నావు. బాగా కడుపునిండా తిని పరున్నావు. ఏం!" అన్నది.

కుంజనాథుడు నవ్వుతూ "అయితే నువ్వే చెప్పు చెల్లీ నేనింకా ఏంచెయ్యాలిసిందీ. ఆవిడ బలవంతం చేస్తుంటే నే నెలా వచ్చేది!" అన్నాడు.

"మంచిది. ఇక ముందు మాత్రం నువ్వాగ్రామం వెళ్ళకు." ఆమె ఇలా అనడానికి అతనికి కారణం కనపడ లేదు. "నే నెందుకు వెళ్ళకూడదు!"

"వాళ్ళు తోవలో కనపడి నిన్ను బలవంతంచేసి తీసుకు వెడతారు. వారి కేం శ్రీమంతులు! ఇలా అయితే మన కెలా గడుస్తుంది!"

చెల్లెలిమాటలకు అతను విచారపడ్డాడు.

కుసుమ ఈవిషయం తెలుసుకుని చిరునవ్వు నవ్వుతూ "కా దన్నయ్యా! నే నలా అనడం లేదు. వారు గొప్పవారు. మనం పేదవాళ్ళం. వారితో మనం స్నేహంగా ఉండే అవసరం ఏ ముందీ!" అన్నది.

“అయితే చెల్లీ నేనే స్వయంగా వెళ్ళడం లేదు.”

“నిజమే నువ్వు స్వయంగా వెళ్ళవు. కాని నాగు పిలిచినా మన మెందుకు వెళ్ళడం?”

“అలా అయితే నువ్వు బ్రాహ్మణుల పిల్లలతో ఎందుకు కలిసి మెలిసి వుంటావు? వారుకూడా గొప్పవారింటి పిల్లలేగద. మ రెందుకు వెడతావు?”

అన్న భావాన్ని తెలుసుకుని చెల్లెలు నవ్వుతూ “వాళ్ళతో చిన్నప్పట్నించీ ఆడుతూ వచ్చాను. అది గాక వాళ్ళు మన కులస్థులు కారు. వాళ్ళిళ్ళకు వెళ్ళడం సిగ్గుచేటు కాదు. వారి విషయం వేరు...” అన్నది.

కొంచెంసేపు నిశ్శబ్దంగా వుండి కుంజనాథుడు అన్నాడు: “అ దేమిటి! వారింటికి వెళ్ళడం మాత్రం తప్పా? వారిమీద లక్ష్మీకటాక్షం ఉన్నది. వారూ నాలుగుడబ్బులున్న వారే. వాళ్ళదగ్గిర అహంభావం ఏకోశానా లేదు. అంతాకూడా దేవతావిగ్రహాలనుకో. బృందావనుతల్లి నారెండుచేతులూ పట్టుకొని ఎలాఎలా...” అతనిమాట పూర్తి కాకుండానే కుసుమ విసుగుతో “మళ్ళీ అవేపాతమాటలు! మనతల్లిమీద పెద్దఅపవాదు వేశారు. మరిచిపోయావా అన్నయ్యా?” అన్నది.

కుంజుడు వాదించాడు. “నా కెవరితోను ఒకటిమాటయినా అనలేదు, ఎవరోతుంటర్లు ఈర్ష్యతో అబద్ధాలు చింతలూ వలవలూ కల్పించి అపవాదు మోపారు.”

“అందుకేనా మనల్ని వారు ఇంట్లోంచి వెళ్ళగొట్టి, రెండో పెళ్ళి చేసుకున్నారు? ఏ మంటావు?”

కుంజనాథుడికి ఏమీ పాలు పోలేదు. "ఇది నిజం. అయినా బృందావను ఏం చేశాడు? ఏ దయినా దోషం వుంటే అది అతని తండ్రిదే."

కుసుమ శాంతంగా కొంతసేపటికి: "మంచి దన్నయ్యా! ఏది కాదో అదే పదేపదే చెప్పడం ఎందుకు? నీతో వాదించ లేను. పోనిస్తూ పాడుగోడవ!" అన్నది.

మొదట్లో కుంజనాథుడు ఏమీ చెప్పలేక విసుగుతో "నువ్వేమీ మాట్లాడవు. నేను మాత్రం ముందూ వెనకా చూడవలసి వస్తుంది. కొద్దిగా ఆలోచించు, నే నీరోజున చస్తే రేపు నీగతి ఏ మవుతుందో" అన్నాడు.

కుసుమ విరక్తితో ఏమీ మాట్లాడ లేదు.

కుంజుడు గంభీరంగా "తెలిసిన పెద్ద ల్నందర్నీ అడిగాను. ముసలి బైరాగి తల్లితో కూడా ప్రస్తావించాను. వా రెలా ఒప్పుకున్నారో నీ కేం తెలుసు?" అన్నాడు.

కుసుమముఖంలో కర్కశభావం కనపడింది. "ఎందుకు తెలి యదు లెస్తూ" అన్నది. తనతల్లిమీద మోపిన అపవాదును గురించీ, మారుమనువునంగతీ కులంలో ఆలోచనలు జరగడం, తర్వాత నలుగురూ కనబరచిన అభిప్రాయాలు ఆమెకోపాన్ని రెచ్చగొట్టినవి. అయినా తనభావాన్ని కప్పిపుచ్చి "ఏమన్నయ్యా నువ్వు ఏం తింటావు?" అన్నది కుసుమ.

"ఏమీ తినను. నాకు ఆకలి వెయ్యడం లేదు".

పొంగుతున్న కోపాన్ని దిగమింగి కుసుమ గదిలోకి వెళ్ళి

పోయింది. కుంజనాథుడు చిలుములో పొగాకు నింపి దమ్ము పీల్చి తర్వాత గోడకు దాన్ని ఆనించి బిగ్గరగా "కుసుమా!" అని పిలిచినాడు.

కుట్టుపని చేస్తున్న కుసుమ ఎందుకు అన్నది.

"ఇంత పొద్దు పోయింది. తినడానికి ఏం చెయ్యలా?"

కుసుమ అకర్ణించే జవాబు ఇచ్చింది. "చెయ్యను. నే నివాళ ఏం చెయ్యను."

"నే నడిగేదీ అదే. ఎందుకు చెయ్యవని?"

కుసుమ అలిగి నేను వాగలేను అన్నది. చెల్లెలిమాట విని కుంజుడు చప్పుడు చేస్తూ గదిలో ప్రవేశించి "చూడు కుసుమా! నువ్వు నాకు మంట ఎత్తించబోకు. ఇలానే నువ్వు వుండి కేస్తే ఎటో చెప్పకుండా వెళ్ళిపోతాను. అబద్ధం అనుకొంటున్నావేమో!" అని అరిచాడు.

"పో శీఘ్రంగా పో. పాటకజనంలాగ ఇంట్లో నిన్ను అరవనియ్యను. బజార్లోకి వెళ్ళి బాగా ఎగురు అంతగా ఇష్టమయితే."

కుంజుడికి కోపం వచ్చి "పెద్దమ్మా! చెల్లెలివై నన్నింట్లోంచి గెంటేస్తావా?" అన్నాడు.

"నిజంగా గెంటుతాను. పెద్దవాడి వయితేమాత్రం ఇష్టం వచ్చినట్టు పేల్తావా?"

చెల్లెలిముఖం చూచి కుంజనాథుడు భయపడ్డాడు. కొంచెం తెంత్తపడి "సరే కాని నే నేం తప్పుచేశాను?" అన్నాడు.

"నన్నడగకుండా వెళ్ళి తిని వచ్చావు."

"ఇందులో తప్పేమిటి?"

"ఏం తప్పా? చాల పెద్దతప్పు!" అని కుసుమ కోపంతో "నే నీరోజు అంటున్నాను. ఇం కెంప్పుడూ వెళ్ళకు!" అని తీవ్రంగా అన్నది.

కుంజునాథుడు అగ్రిసోదరుడు అవడంవల్ల తనఅపజయాన్ని అంగీకరించడానికి సిగ్గు పడ్డాడు.

"నీవు పెద్దదానివా ఆజ్ఞ లివ్వడానికి? నాయిష్టం వచ్చిన చోటికి వెడతాను. నీకేం?"

కుసుమ తీవ్రంగా "ఊహూం నిన్నిప్పుడు వెళ్ళనివ్వను. వెళ్ళా వంటే బాగుండ దన్నయ్యా! నేను చెప్పలే దనబోకు!" అన్నది.

ఇప్పుడు కుంజుడు నిజంగా భయపడ్డాడు. అయినా పైకి సాహసం చూపుతూ "వెడితే ఏ మవుతుంది?" అన్నాడు.

కుసుమ కుట్టుపని ఆపి నిల్చుని "ఏమవుతుందా, నే చెబుతున్నాను. నాకు కోపం తెప్పించకు వెళ్ళు" అని అరిచింది.

కుంజుడు తడబడుతూ గది బైటికి వెళ్ళి ద్వారానికి అడ్డంగా నిలిచి మెల్లగా "నువ్వు గద్దిస్తే వెడతానా నువ్వు చేసే దేమిటి?" అన్నాడు.

కుసుమ ప్రత్యుత్తరం ఇవ్వకుండాను దీపపువత్తి హెచ్చించింది కుట్టుపని మొదలెట్టింది.

కుంజునిసాహసం తిరిగి హెచ్చుతీవ్రంగా అన్నాడు. "నీవు గర్జిస్తే ఏమీ లేదు. నేను గొంతెత్తి మాట్లాడితే—" అతను

మాట్లాడడం మానేశాడు. లోపలినుంచి శిష్యుని రాకపోవడంవల్ల సంతుష్టుడైనాడు. అందుకే తిరిగి చిలుము తెచ్చుకుని రెండుదమ్ములుపీల్చి "నేను పెద్దవాణ్ణి. ఇంటికి అధికారిన్ని కాబట్టి అన్నిపనులూ...' అంటూ అడుగులసవ్వడి విని వెనక్కు తిరిగి చూచి మౌనం వహించాడు. కుసుమ నిశ్శబ్దంగా వచ్చి అతనికేసి తీవ్రంగా చూస్తూ పని లేక కూచుని దేహాన్ని పెంచుతావా, ఇక్కణ్ణించి నడుస్తావా!" అన్నది.

చెల్లెలి తీక్ష్ణదృక్ప్రసారానికి అన్నగారి గృహయజమానిత్వం అంతా మటుమాయమై నోట మాట పెగిలి రాలేదు. కుసుమ ఇంకోసారి "అన్నయ్యా, వెడతావా వెళ్ళవా?" అన్నది. ఇప్పుడు కుంజనాథుడే కాకుండా అతనికంఠంకూడా మారి గద్గదమయింది. కొద్దిగా పొగాకు నింపుకోగానే వెళ్ళిపోతాను" అన్నాడు.

కుసుమ చెయ్యిజాపి "ఇయ్యి, నా కది ఇచ్చెయ్యి!" అని ఆమె అతనిచేతిలోనుంచి చిలుము తీసుకుని వెళ్ళిపోయి తిరిగి వచ్చి హుక్కామీద చిలుము పెడుతూ "కంసాలిదుకాణానికి వెడతావు కదూ?" అన్నది.

కుంజుడు తల తిప్పుతూ ఆఁ అన్నాడు.

"మంచిది, వెళ్ళు. కాని చూడు, పొద్దు పోయినదాకా ఉండకు. వంట చెయ్యడానికి ఎక్కువ ఆలస్యం కాదు."

కుంజనాథుడు హుక్కా తీసుకుని మెల్లగా వెళ్ళినాడు.

[ ౨ ]

ఆరోజున కుంజూసు తన చెల్లెలికి బృందావన్ ఇంటివిషయం లో చెప్పినమాటల్లో అత్యుక్తి ఎంతమాత్రం లేదు. నిజంగానే వారిల్లు ధనదేవతానిలయమై కళకళలాడుతూ ఉంటుంది. అదే కాకుండా డబ్బున్నదని వారింట్లో అహంకారం కాని దర్పము కాని లేదు.

ఆగ్రామంలో పాఠశాల లేదు. బృందావన్ చిన్నతనంలో అభ్యాసంవల్ల చదువడమూ వ్రాయడమూ నేర్చాడు. అప్పుడే తన పల్లెలో బడి పెట్టడానికి సంకల్పించాడు. కాని అతనితండ్రి గోగదాను చాలా తెలివైనవాడు కావడంవల్ల ఏకైకపుత్రుడయిన బృందావన్ ఇలాంటి పిచ్చిపనులు చెయ్యడానికి అనుమతి ప్రసాదించలేదు. కాని ఆయన చనిపోగానే బృందావన్ వారిచండీమండపంలో బడి పెట్టాడు దానిలో పిల్లలు జీతాలు ఇవ్వవలసిన అవసరం లేకపోయింది. ఇలాగా అతని సంకల్పం కార్యరూపము ధరించింది.

వారివీధిలో పెన్షన్ పుచ్చుకుంటున్న ఒక పంతులుగారుండేవారు. వారిదగ్గర బృందావన్ ఇంగ్లీషు నేర్చుకొన్నాడు. వారు రాత్రిపూట వచ్చి పాఠం చెప్పిపోతూ ఉండేవారు. అందువల్ల ఈ సంగతి ఎవరికీ తెలియలేదు, గ్రామంలో ఎవళ్ళకూ బృందావన్ ఇంగ్లీషు నేర్చుకొన్నాడని తెలియదు.

భార్య పోయాక నేటికి అయిదేళ్ళకిందట అతను చదువులో మనస్సు లగ్నం చేశాడు. సాధారణంగా రాత్రిళ్లు చదువుకుని, ఉదయాన్న ఇంటిపనులు, [illegible] చూసుకొని [illegible]

ఝామ లయ్యేసరికి తానుస్థాపించినబడికి వెళ్ళి రైతుపిల్లలకు చదువుచెప్పేవాడు ఎప్పుడేనా ముసలితల్లి తిరిగి వివాహం చేసుకోమని చెపితే అతను పిల్లాణ్ణి చూపి "ఎవరికోసం పెళ్ళి చేసుకొంటారో వాడు మనదగ్గరే ఉన్నాడు కదమ్మా! ఇంకెందు కమ్మా పెళ్ళి?" అనేవాడు. తల్లి ఏడ్చేది. కాని అతను ఆమెమాటలు పెడచెవిని పెట్టేవాడు. ఇలా రెండేళ్ళు గడిచాయి.

ఆరోజుల్లోనే అతను ఒకనాడు అకస్మాత్తుగా వైష్ణవకుంజుని ఇంటిముందు కుసుమను చూచాడు. ఆమె నదినుంచి స్నానం చేసి భుజంమీద బిందె పెట్టుకొని ఇంటికి వెడుతున్నది. అప్పుడే ఆమెకు యావనోదయం అవుతున్నది. బృందావను ఆమెను ముగ్ధనేత్రాలతో చూస్తూ ఉండిపోయాడు. కుసుమ ఇంట్లోకి వెళ్ళగానే, మెల్లిగా అతనూ వెళ్ళిపోయాడు. అతనికి ఆ వూళ్ళోవాళ్ళంతా తెలుసు అందుకనే ఈపిల్ల ఎవరో సులభంగానే తెలుసుకో గలిగాడు.

పుత్రుడికి సంతానం కలిగినతర్వాత సాధారణంగా ఏసంబంధం ఉంటుందో అదే సంబంధం తల్లికొడుకులకుమధ్య ఉండేది. అతను ఇంటికి వెళ్ళగానే సంకోచం లేకుండా కుసుమను చూచినట్టు తల్లితో చెప్పాడు. "నాయనా, వాళ్ళు మంచివాళ్ళను కొన్నావా?" అంది తల్లి.

"ఎలాగేనా ఆమె నీకోడ లమ్మా! పెళ్ళయ్యాక నాకీ ఆలోచనే రాలేదు",

"అదంతా మీనాన్నగారికే తెలుసు ఆయన కేది మంచి దనితోస్తే అదే చేసిపోయారు".

బృందావను అభిమానంతో "మంచి దమ్మా! అలా అయితే నేను ఇప్పటిలాగే ఉండిపోతాను. మళ్ళీ నువ్వు నా పెళ్ళిమాట ఎత్తకు." అన్నాడు.

ఈసంభాషణ జరిగికూడా మూడేళ్ళు గడిచింది. ఈలోపున బృందావను తల్లి కుసుమను తీసుకు రావడానికి ప్రయత్నాలు చేసింది. కాని లాభం లేకపోయింది. కుసుమ ఏవిధంగానూ ఒప్పుకో లేదు. ఆమె దీనికి ప్రతికూలంగా ఉండడానికి రెండు కారణాలు ఉండేవి. మందమతి అసమర్థు డయిన అన్నను వది లేసి మ రెక్కడికీ వెళ్ళదలచుకో లేదు. రెండో కారణం ఏవిధ మయిన ప్రాయశ్చిత్తం లేకుండానే అత్తారింటికి వెళ్ళగలిగి వుంటే, ఆమె అన్నగారినిస్సహాయతను కారణంగా తీసుకుని అతనిమాటను ఎను రానేది కాదు. ఆమె ఆలోచించేది; "మళ్ళీ వెనకటితంతు అంతా జరగాలి. రకరకాల నైవేద్యాలు లంతా గుమికూడుతారు. నాతల్లి మిథ్యాకళంకాన్ని గురించి చర్చ జరుగుతుంది. నాచిన్ననాటిసంగతు లన్నీ తిరిగి వస్తాయి. ఇంకేమేమిటో చాటభారతమంత గాథ అవుతుంది. అమ్మలక్క లంతా కుతూహలంతో చూడడానికి వస్తారు. నాస్నేహితు లంతా తొంగి చూసి ఇళ్లకు వెళ్ళి "తక్కువకులాల వాళ్ళలాగ కుసుమకు మారుమను వైంది" అని అంటారు.

ఛీ ఛీ! ఈమాట లన్నీ తలుచుకొని సిగ్గుతో తల వంచు కొనేది. గొప్పఇంటిబిడ్డలతో కలసి రాతా కోతా నేర్చుకోడం మూలాన, వారిలాగే ఆమె అందగత్తె కావడంవల్ల, కులానికి ఆమె తక్కువదాన్నని ఒప్పుకొనేది కాదు. నిన్న సందెవేళ

అన్నతో కుసుమ జగడం పెట్టుకొన్నది. ఆసందర్భంలో ఆమె కోపంతో చేటుపెట్టి తీసుకొచ్చి అన్నగారి కాళ్ళదగ్గర పడేసి "నే నింక ఈకొంపలో ఉండ" నంది. నేటి ఉదయం ఆమె స్నానం చేసి తిరిగి వచ్చేసరికి అన్న ఇంట్లో లేడు. మూటా ముల్లె లేవు. రాత్రి చేసినతప్పును సమర్థించుకోడానికి పారి పోయాడని ఆమె నవ్వుకొన్నది. కాని ఆమె పొరపాటు పడ్డది. పొరపడినట్లు తరవాత తెలుసుకొన్నది.

కుసుమ సత్యమూ తెల్లారకట్ల పను లన్నీ చక్కబెట్టి పేడతో ఇల్లంతా అలకవలసి వచ్చేది. నదిలో స్నానం చేసి నీళ్ళు తీసుకురాగానే అన్నకు వంట చేయవలసి ఉండేది. కుంజ భోంచేసి వెళ్ళిపోయాక ఆమెకు పూజ చేసుకోవడం అలవాటు. అలా కాకపోతే కుంజనాథుడు మధ్యాహ్నం తిరిగి వచ్చేవాడు. అన్న రావడానికి ఇంకా వేళ కాలేదని ఆమె పువ్వులు కోయడం మొదలెట్టింది. ఇంటిముందు కొన్ని పూలమొక్క లున్నవి. పూజ చేసుకోడానికి కూర్చునే సరికి ప్రాంగణంలో కొన్ని ఎడ్ల బండ్లు వచ్చి ఆగినవి. ఇంతలోనే ఒకావిడ తలుపు తెరుచుకొని లోపలికి వచ్చింది. ఇద్దరూ ఒకర్ని ఒకరు చూసుకొంటూ ఉండిపోయారు. కుసుమ ఆమెను ఎప్పుడూ చూడలేదు. కాని ముక్కుమీద తిలకం, మెళ్ళో మాలిక చూసి వైష్ణవురా లని తెలుసుగొన్నది. కొత్తావిడ కుసుమకు దగ్గరగా వచ్చి నవ్వుకొంటూ "అమ్మాయీ, నువ్వు నన్ను గుర్తించక పోవచ్చు. కాని మీఅన్నయ్యకు నేనెవరో తెలుసు ... కుంజనాథుగారు ఎక్కడున్నారు? " అన్నది.

కుసుమ "తెల్లారకట్టే బయటికి వెళ్ళిపోయారు. కొంచెం ఆలస్యంగా వస్తారేమో." అన్నది. ఆవిడ విస్మయంతో "ఆఁ... ఆలస్యంగా వస్తాడా? నిన్ననే బృందావనుడు ఇంకా నలుగ్గురైదుగురు పిల్లల్ని, వాళ్ళంతా మావాళ్ళే మేనల్లుళ్ళు అవుతారు - భోజనానికి పిలచాడు. ఇందుకే నేను బృందావనుతో ఉదయాన్నే నాయనా, బండివాణ్ణి బండి తోలుకు రమ్మను. నేను కూడా కోడల్ని చూసి ఆశీర్వదించి వస్తా" అన్నాను.

ఈమాటలు విని కుసుమ తెల్లపోయింది కాని సంబాళించుకొని, ముసుగు కొంచెం ముందుకు లాక్కుని వెంటనే ప్రణామం చేసి చాప తెచ్చి గదిలో పరచింది. కుసుమకు ఇప్పుడు ఆమె అత్తగారని తెలిసింది. ఆవిడ చాప మీద కూర్చుని నవ్వుతూ "నిన్న భోంచేశాక బృందావన్ నవ్వుతూ అన్నాడు, 'కుంజనా అన్నయినా నా దౌర్భాగ్యంవల్ల ఇన్నాళ్లబట్టి ఇంటికి రమ్మని అనలేదు అదీ గాక మేనల్లుళ్ళు కూడా చాలా రోజులనుంచీ మనఇంట్లోనే ఉన్నారు. ఈమాటకు కుంజుకు నవ్వుతూ అందర్నీ రమ్మన్నాడు. అందుకని వాళ్లంతా కూడా వచ్చారు." అన్నది. కుసుమ తల వంచి మాట్లాడకుండా నిలుచున్నది.

బృందావన్ తల్లికూడా చాలా ఊహాపోహాలు గలమనిషి. కుసుమభావాన్ని తెలుసుకొని ఇందులో ఏదో తమాషా వుందని ఊహించి సందిగ్ధంగా ఆవిడ "ఏం కోడలా, నీతో కుంజనాథుడు ఏమీ చెప్పిపోలేదా?" అన్నది.

ముసుగుతో మరుగుపడిన శిరస్సు ఆడిస్తూ ఆమె లేదని స్పష్టం చేసింది. బృందావన్ తల్లి ఈమాట నమ్మకుండా కుంజ

నాథుడు చెల్లెలికి అంతా చెప్పేసి వుంటాడని నిశ్చయం చేసుకుని "నాపిచ్చినాయన పొరపడ్డాడని నాకు భయంగా ఉన్నది- ఇప్పుడాయన ఏవో కావలసినవస్తువులు తీసుకుని వెంటనే తిరిగి వస్తా రనుకొంటాను ... ఇదుగో అంతా రానే వచ్చారు" అన్నది.

బృందావన్ ఒక్కపర్యాయం బైటనుంచే కుంజనాథ్ అని తర్వాత లోపలికివచ్చి నిలుచున్నాడు. అతనివెంట ఇంకా చాలా మంది పిల్లలున్నారు.

అతనితల్లి "కుంజనాథ్ బయటికి వెళ్ళిపోయాడు. అమ్మాయీ! లోపలనుండి ఏ మయినా తెచ్చి పరు అమ్మా! పిల్లు కూర్చుంటారు." అన్నది. కుసుమ కష్టంగా అన్నగదిలో నించి పరచింది తరవాత చేతిలో చిలుము తీసుకుని పొగాకు నిప్పు డానికి వంటింట్లోకి వెళ్ళిపోయింది. ఇది చూచి బృందావన్ నవ్వుతూ ఉండని మేము పొగాకు తాగం అన్నాను. కుసుమ చిలుము అక్కడే పెట్టి వంటింటి స్తంభానికి ఆనుకుని నిలుచున్నది. వివేకశూన్యుడు అన్నగారు ఆమెకు ఎంతవింత్తు తీసుకొచ్చి పెట్టాడు. అవమానం కలుగుతుం దని ఆమెనేత్రాలు క్రోధంతో అభిమానంతో లజ్జతో అశ్రుపూరితా లయినాయి. నిన్ననే ఇంట్లో వున్నవస్తువులు నిండుకున్నాయి. స్నానానికి వెడుతూనే ఆమె అన్నను సంతకు పంపా లని ఆలోచించింది. తిరిగి వచ్చే సరికి కనపడలేదు గొప్పవా రింట్లో అడుగు పెట్టినందుకు కుసుమ చాలా క్రోధం ప్రకటించింది. అలాంటప్పుడు వారిని బంధుసహితంగా ఆహ్వానించడం! ఈఅపరాధం మొదటివాటి

కంటెచాలాపెద్దది! ఇందువల్లనే చెల్లెలితో ఒక్కమా టయినా చెప్పడానికి అతనికి సాహసం లేకపోయింది. అందుకే ఏలాగయినా చీకటి పడిందాకా తిరిగిరాడు. ఇదంతా తలచుకుని కుసుమమనస్సు వికలమై పోయింది. రొక్కపుపెట్టి తాళంచెవికూడా ఆమెదగ్గర లేదు. పైగా చేతిలో దమ్మిడీ కూడా లేదు. కుసుమ ఏమీ ఆలోచక నిలబడిపోయింది. వెంటనే ఆక్రోధం అంతా బృందావన్ మీద విరుచుకుపడ్డది. నిజానికి తప్పంతా అతనిదే. తెలివితక్కువ అన్నను తోవలో పట్టుకుని ఎందుకు తీసుకుపోవాలి! పోనీ తీసుకువెళ్ళాడు, వేళాకోళం చెయ్యడం ఎందుకు? అదీగాక పీ రెవరు పిలిచి విందులు కుడప డానికి? మూడేళ్ళబట్టీ బృందావన్ ఏదో నెపంమీద ఇటునైపు తిరుగుతూ అన్నతో ఎన్నో మాయమాటలు చెప్పి లోబరుచు కోడానికి చూస్తున్నాడు. అహోరాత్రిలు పని లేకుండానే ఆమె ఇంటిముందు పచారీ చేసేవాడు. ఆమెస్థితిగతులు తెలుసు కోబట్టే చాలా ప్రయత్నం చేసి వారిని అవమానపరచడానికి ఇంత కౌశలం చూపించాడు; శిలావిగ్రహంలా నిలబడిన కుసుమ కన్నీళ్ళు తుడుచుకోవడం మొదలెట్టింది. ఆమె చాలా అభిమానవతి. అయినా ఈసమయంలో వొంటరిది. ఏం చేస్తుంది? బృందావనుతల్లి లేచి లోపలికి వెళ్ళి పిల్లలతో మాట్లాడుతున్నది. కాని ఆవిడకొడుకు కళ్ళు నాలుగువైపులా పచారు చేస్తున్నాయి. అకస్మాత్తుగా అవి వంటింట్లో నిలుచున్న కుసుమవైపు వాలినవి. దృక్కులు ఏకం కాగానే ఆమె తనను లోపలికి రమ్మని సంజ్ఞ చేస్తున్నదేమో నని బృందావనుకు

తోచింది. ఇంతలో అతని హృదయం వెర్రెత్తి పోయింది కొంతసేపటికి ఆమె పిలవడం అసంభవ మనీ తననేత్రాలు కల్పించిన ఇంద్రజాల మనీ అతనికి తోచింది. నన్ను చూడ గానే ముసుగు మూరెడు కిందికి లాక్కునే పిల్లేనా ఇలా నాకు సంజ్ఞ చేసేది! ఇది ఎంతమాత్రం నిజం కాదు'' అనుకొని అతను దృష్టి మరల్చాడు. కాని దృష్టి మరల లేదు. ఆమెనేత్రాలనే స్పృశిస్తూ ఉండిపోయింది. కుసుమకూడా అతని కేసి చూస్తూ చేసంజ్ఞతో పిలిచింది. బృందావన్ తడబడుతూ వంటింటి గుమ్మందగ్గిరికి వెళ్ళి కోమలస్వరంతో 'నన్ను పిల్చావా?' అన్నాడు.

కుసుమకూడా „అలాగే ఆఁ" అన్నది.

బృందావను ఇంకా మృదువుగా "ఎందుకూ?'' అన్నాడు. కొంతసేపు నిశ్శబ్దంగా ఉండి ఆమె గద్గదస్వరంతో "మాలాంటి పేదవాళ్ళను ఏడిపించడంవల్ల మీ కేంగొప్పతనం.'' అన్నది. బృందావన్ ఏమీ మాట్లాడ లేదు. కుసుమ అతికర్కశ స్వరముతో "మీకు మేము ఎలా కాలం గడుపుతున్నామో తెలియదా? అలాంటప్పుడు అన్నయ్యతో ఎందుకు వేళా కోళాలు? ఎందుకు ఇంతమందితో భోజనానికి రావడం?" అన్నది. మొదట ఈకఠోరప్రశ్నలకు ఏమి సమాధానం ఇవ్వాలో బృందావనుకు తోచలేదు. కాని అతను ధీరప్రకృతికి చెందిన మనిషి కాబట్టి దేనికీ అధికంగా చలించడు. కొంతసేపటికి సహజ శాంతస్వరంతో "కుంజనాథ్ ఎక్కడున్నాడు?"

అన్నాడు. కుసుమ 'తెలియదు.' నాతో చెప్పకుండానే పొద్దున్నే ఎటో పారిపోయాడు అని చెప్పింది.

బృందావన్ "వారు వెళ్లినా నే నున్నాను కదా!— తిను బండారాలు ఏమీ లేవా?" అన్నాడు.

"ఏమీ లేవు— అన్నివస్తువులూ నిండుకున్నాయి. ఈ సమయంలో నాదగ్గర రాగిడబ్బుకూడా లేదు."

"ఈగ్రామంలో నీలాగే నాకూ అందరూ తెలుసు. నేను వస్తువులు కొని మనిషి కిచ్చి పంపుతాను. అంగోస్త్రం ఇస్తే నే నిప్పుడే స్నానం చేసి వస్తాను. అమ్మ ఒకవేళ అడిగితే స్నానానికి వెళ్ళానని చెప్పు— ఇక్కడ ఇం కెందుకు నిలబడతావు?" అన్నాడు. కుసుమ గదిలోకి వెళ్ళి అంగోస్త్రం తెచ్చి ఇచ్చింది. దాన్ని తలకు చుట్టుకొంటూ బృందావన్ నవ్వుతూ "నువ్వు కుంజనాథుడి చెల్లెలివి కాబట్టే ని న్నిలా వుంచి వెళ్ళిపోయారు. ఇం కొకర్ని ఇలా వదల్లేరు" అన్నాడు.

కుసుమ చాలా నెమ్మదిగా "అంతా ఇలా వదల్లేరు. కొంత మంది చాలాహాయిగా వదిలివెయ్య గలుగుతారు" అని బృందావను చూడడం మొదలెట్టింది,తన మాటలు అతనిహృదయానికి ఎంత బాధ కలిగించ గలిగాయో, నని.

వెడుతున్నవా డల్లా ఆగి మెల్లిగా "నీభ్రమ వట్టి దని ఎప్పుడో తప్పక తెలుస్తుంది. చిన్నతనంలో నీతల్లి దోషానికి నీ వెలా బాధ్యురాలవుకావో అదే విధంగా నాతండ్రి చేసిం దానికి నేను బాద్యుణ్ణి కాను పోనీ లే.తగాదాకు ఇప్పుడు సమయం కాదు. వెళ్ళి వంటప్రయత్నం చెయ్యి" అన్నాడు.

“ బాగుంది. వంటప్రయత్నం నే నేం చేసేది? ఒకవేళ నాతల కోసివండి పెడితే మీకు కడుపు నింపుతుం దంటే చెప్పండి అందుకుకూడా సిద్ధంగా ఉన్నాను!” అన్నది కుసుమ.

రెండడుగులు నడిచినవాడల్లా తిరిగి వచ్చి మెల్లిగా “నువ్వే మన్నా నేను సహించవలసి వస్తుంది. కాని ఇలానే కోపంతో అమ్మతో మాట్లాడావు. ఆమె చిన్నమాటకే పెద్దఅర్థం తీస్తుంది” అన్నాడు.

కుసుమ కోపంతో “ నేను పశువును కాను, నాక్కూడా కొంచెం బుద్ధి ఉన్నది” అన్నది.

“ ఇలా అని నాకు తెలుసు కాని బుద్ధికన్న కోపం ఎక్కువని కూడా తెలుసు. కుసుమా! మరోమాట- అమ్మ స్నానం చేసి వచ్చింది. కాని పూజ చేసుకో లేదు. ఆవిడకు కావలసింది ముందుచూడు. నేను వెడుతున్నాను.”

“ వెళ్ళండి, కాని అక్కడే కోతలు కోస్తూ కూచోకండి.”

బృందావన్ నవ్వుతూ ‘అలానే కాని నాకయితే అలస్యం చేసి నీచేత మాటలు పడా లని ఉంది. ఇంకోరోజున వడ్డిస్తా నని ను వ్వంటే ఇవాళ తొందరగానే వస్తాను” అన్నాడు.

“అప్పటిసంగతి చూదాం” అంటూ కుసుమ వంటింట్లోకి వెడుతూండగా బృందావన్ కోమలస్వరంతో ‘ఆశ్చర్యంగా ఉంది. ముందుకు ముందే నువ్వు మాట్లాడతా వని నే నెప్పుడూ అనుకో లేదు. యుగయుగాంతరాలనుండి నువ్వు న న్నిలాగే శాసిస్తూ వస్తున్నట్టు కనపడుతుంది. దైవనిర్మిత మైనవింత బంధ మిది కుసుమా!” అన్నాడు.

కుసుమ వింటూ నిలుచున్నది. ఆమె మాట్లాడ లేదు. బృందావను వెళ్ళిపోగానే కుసుమకు పూర్వోక్తసంభాషణ స్మరణకు వచ్చి శరీరం కంపించిపోయింది. వంటింట్లోకి వెళ్ళి ఆమె స్థిరంగా కూర్చున్నది. స్వాభిమానంవల్ల భర్తను మోటు రైతుగా భావించినది కుసుమ. అతని సంభాషణవల్ల ఆమెకు కొత్తకోర్కెలు వినూత్నానందం కలిగినవి.

[ 3 ]

ఆరోజు సందెవేళ బృందావన్‌తల్లి ఇంటికి వెళ్ళేలోగా కుసుమను దగ్గిర కూర్చోబెట్టుకుని అశ్రుగద్గదకంఠంతో "కోడలా! ఈ రోజు ఎంత హాయిగా జరిగిపోయిందో చెప్పలేకుండా ఉన్నాను. బిడ్డా! సదా సుఖంగా ఉం డమ్మా." అని పైట చెరగునుంచి బంగారుమురుగులజత పైకి తీసి కుసుమచేతులకు తొడిగింది. కుసుమ భోజనసదుపాయాలు బృందావన్‌సాయం తోనే చేసిం దని ఊహించి ఆమెహృదయం ఆశతోనూ ఆనందంతోనూ నిండి పోయింది. పైటకొంగు మెడకు చుట్టు కొని కుసుమ అత్తగారికి ప్రణామం చేసి ఆవిడపాదధూళి తీసు కొని నిల్చున్నది. అత్తాకోడళ్ళమధ్య ఈ విషయంలో ఏవిధ మయిన మాటలూ జరగలేదు. బండిమీద కూర్చుని ఆమె కోడలితో "అమ్మాయీ! కుంజనాధుడు పిచ్చివాడిలా ఎక్కడ ఉన్నాడో తెలియదు. రాగానే రేపోసారి నాదగ్గరికి పంపిం చమ్మా". అంటే కుసుమ తల ఊపి అంగీకారం ప్రకటించింది.

బృందావనుడితాత తనఇంట్లో గౌరాంగమహాప్రభుమూర్తిని స్థాపించాడు. అదే గదిలో బృందావన్ తల్లి రాత్రి పొద్దుపోయే దాకా జపం చేసుకుంటూ కూర్చున్నది. మనముడు ఆమెతొడ మీద తల పెట్టి నిద్ర పోయాడు. వాడిమీద దీపంకీనీడ పడు తున్నది. ఇందుకనే బృందావన్ రాగానే అతనికి వారు కనపడ లేదు. వేదికదగ్గర అతను సాష్టాంగం చేసి మనస్సులో చాలా సేపు ప్రార్థనచేస్తూ కూర్చుని తిరిగి ప్రణామం చేసి లేచి నిలవ బడగానే అతని దృష్టి తల్లిమీద ప్రసరించింది. తనలో తనే సిగ్గు పడి తల్లితో "చీకట్లో ఎందుకు కూర్చున్నావమ్మా?" అన్నాడు.

"అవును నాయనా! నువ్విలా కూర్చో" బృందావన్ కూర్చు న్నాడు. అతను సిగ్గుపడడానికి కారణం ఉన్నది. రాత్రి ప్రొద్దు పోయాక యెన్నడూ స్వామిదగ్గిరికి వచ్చే అలవాటు లేదు. ఏ ఆశాతీత సౌభాగ్యంవల్ల అతని హృదయం ఆనందంతో పరి పూర్ణమైందో, దేనివల్ల అతను జన్మసార్థకమైనదిగా భావిం చాడో దానికి కృతజ్ఞత గుప్తంగా నమ్రితతో చూపడానికి స్వామి సన్నిధికి వచ్చాడు. కాని ఇతరులు తన మనోభావాన్ని గుర్తించారని సిగ్గు పడ్డాడు. కొంతసేపటికి నిద్ర పోతున్న పిల్ల వాడి తల నిమురుతూ తల్లి స్నేహపూర్ణ స్వరంతో అన్నది. "తల్లి లేని ఈవంశాంకురాన్ని వదిలేసి లేవడం నావల్ల కాదు. అయినా ఎందుకో గాని బృందావన్ ఈ రోజున ఎవరో నా తల మీదబరువు దింపినట్టు భావిస్తున్నాను. నాన్నా! వీణ్ణి ఇంక ఇంట్లోకి తీసుకు వెళ్ళు— ఇవస్నీ కోడలి చేతులలో పెట్టి ముక్తి

పొంది కొన్నాళ్ళపాటు కాశీ బృందావనం తిరిగి వత్తా మని వుందిరా!'' అన్నది.

నేడు బృందావనుడి మనస్సులో కూడ అదే విధ మైన ఆశా విశ్వాసవాహిని ప్రవహిస్తూంది. అయినా సిగ్గుతో "ఎందు కొస్తుం దమ్మా" అన్నాడు. తల్లి నిశ్చితాన్ని దృఢత్వాన్ని చూపుతూ "ఎందుకు రాదురా? కుసుమ వస్తేనే కదూ నాకు సెలవు దొరికేది? ఇన్నిరోజుల బట్టీ నే నక్కడికి వెళ్ళకపోవడం పొరపాటే సుమా! వచ్చేప్పుడు నాచేతిమురుగులు కోడలికి తొడగ్గానే నాపాదధూళి తీసుకుని నిల్చున్నది. బరు వంతా తగ్గిపోయిం దని అప్పుడే అనుకొన్నాను. నువ్వు చూడ రాదూ మంచిరోజు రాగానే తీసుకొస్తానో లేదో!'' అన్నది. బృందావన్ కొంతసేపటికి "ఆమె వచ్చి పిల్లాణ్ణి తిన్నగా చూ స్తే గదమ్మా" అన్నాడు.

"ఎందుకు చూడదూ? ఆ భయం నాకు లేదు.''

"ఎందుకు భయం లేదు?''

"నాన్నా! నేను బంగార మేదో ఇట్టే తెలుసుకో గలను. మేలిమో కాదో ఇప్పుడే చెప్పలేను. కాని ఇత్తడీ గిల్టు మాత్రం కాదు. ఆమె మంచిది కాకపోతే తీసుకు వస్తా నని అనసే అనను. ఆం, బృందావన్, కోడలు ఎప్పుడూ నీతో ఏ మని మాట్లాడుతుంది? "కాదమ్మా! ఎప్పుడూ మాట్లాడదు. ఇవాళ ఏదో సంకటంలో పడబట్టే..." ఇలా అంటూ బృందావన్ నవ్వి ఊరుకున్నాడు.

తల్లి గంభీరంగా "అవును నాన్నా! నిజమే. దీనిలో ఆమె దోషం ఏమీ లేదు. మనిషి విపత్తులో పడ్డప్పుడు వాస్తవంగా తన వాడయినవాడి దగ్గిరికే పరుగెడతాడు. నేను ఆడదాన్నిగా, కోడలు నాతో ఏమయినా చెప్పిం దేమో చూడు. నీతో చెప్పింది." బృందావన్ వింటూ ఉన్నాడు. తల్లి మళ్ళా మొదలెట్టింది: "కుంజనాధుడి పెళ్ళి చేస్తే నేను చేయ వలసిన కార్యాలు అయిపోతాయిరా." తరవాత నవ్వుతూ "వాడూ మంచివాడే. ఊళ్ళో వాళ్ళందర్ని భోజనానికి పిల్చి తను పారిపోయాడు. తరవాత ఏది కావాలో అదే అయింది." అన్నది.

బృందావన్ నిశ్శబ్దంగా నవ్వినాడు.

తల్లి ఇలా అన్నది: "అన్న చెల్లెలుకు చాలా భయపడతా డని విన్నాను. పెద్దవాడయికూడా తమ్ముడిలా వుంటాడట. ఒక్కొక్క జాతకప్రభావం అలానే వుంటుందిరా బృందావన్. వాడితో భయపడనిది ఏ పనీ జరగదు. మనకోడలుకూడా అదే మోస్తరు మనిషి— నెమ్మది కల దయినా చాలా గట్టిది, నేను కూడా బాగా బరువు మోసే వాళ్ళనే కోరతాను. అలాంటి దయితేనే అన్నీ అప్పగించి నిశ్చింతగా ఎటన్నా వెళ్ళవచ్చు గద —— —— ఒక్కరోజులోనే కుసుమంటే నాకు ఎంత ప్రేమ పుట్టింది? మళ్ళీ కోడల్ని ఎప్పుడు చూస్తానా, ఎప్పుడు తీసు కొస్తానా అని అదే ఆలోచన." బృందావన్ సిగ్గుపడి మాట లను విషయాంతరంలోకి మార్చాడు.

'అమ్మా! కుంజుడివిషయంలో ఏదో చెపుతున్నావు!"

"అవును రా! అదే చెప్పబోతున్నాను. కోడల్ని తీసుకు రావడానికి ముందు కుంజును ఒకఇంటివాణ్ణి చేసేభారం మన మీాది ఉన్నది. నువ్వు గోపాల్‌తో తెల్లారుఝామున బండి తోలుకు రమ్మను. నేను నల్‌డాంగా వెళ్ళి వచ్చేస్తాను. అక్కడి గోపాల్ బైరాగీ బిడ్డ చూడ్డానికి నాకు బాగుంది. ఇంతే కాకుండా——" అర్థోక్తిలో నవ్వుతూ "ఇంతేకాకుండా ఆమె ఒక్కత్తే పిల్ల. ఏ మమ్మా? ఆ బైరాగికూడా ధనసంపత్తి వదిలేసి పోయాడుకదూ?" అన్నాడు.

తల్లికూడా చిరునవ్వు నవ్వి "అవును నాయనా! కుంజుకు అన్నిటికంటె అది ఎక్కువ అవసరం. వట్టి పెళ్ళి వల్ల ఏమవు తుంది? తినడానికి ఏమయినా ఉండాలి కదూ? పిల్ల అనాకారి కాదు. నలు పన్నమాటే కాని ముక్కూ మొహం తీరూ బాగుంది. వెళ్ళి చూస్తాను ఏమవుతుందో."

"మంచి దమ్మా! నేనూ లగ్నం పెట్టిస్తాను. నువ్వు స్వయంగా వెళ్ళాక వట్టి చేతుల్తో రావని నాకు బాగా నమ్మకంగా ఉంది."

[ ౪ ]

కుంజుడి పెళ్ళి ఎలా జరగాలో ఇచ్చి పుచ్చుకోవడంలో సంగతి సందర్భాలు బాగా ఆలోచించి బృందావనుడితల్లి అన్నీ కుదిరిన తర్వాత మూాడు ఝాములకు ఇంటికి తిరిగి వచ్చింది.

ఆసమయంలో చండీమండపానికి ఎదురుగా పిల్లలంతా వరసగా నిలబడి ఎక్కాలు చదువుతున్నారు బృందావన్ ఎదు

రుగా నిలుబడి వింటున్నాడు. బండి వచ్చి ఆగినతర్వాత అతని కొడుకు చరణుడు బండిలోంచి దిగి అల్లరి చేస్తూ తండ్రిదగ్గిరికి వచ్చాడు. ఇవాళ వాడుకూడా నాయనమ్మవెంట తన కోడలిత్తను సంపాయించడానికి వెళ్ళాడు. బృందావన్ వాణ్ణి వొళ్ళోకి తీసుకొనే సరికి, తల్లి బండిలోంచి దిగింది. ఆమెప్రసన్న ముఖం చూచి "ఏ మమ్మా ఎప్పటికి ముహూర్తం నిశ్చయం అయింది?" అన్నాడు.

"ఈనెలాఖరుకే. ఇంకా ఎన్నాళ్ళో లేదు రా. లోపలికి రా. ఇంకా చాలా మాట్లాడాలి." ఆమె నవ్వుకొంటూ వెళ్ళింది. ఆనందంలో పొంగిపోతున్నది! కోడలు వస్తుందిట! ఆమెకూడా పొదుపూపనిపాటలు నేర్చినపిల్లట.

"నాఏకైకపుత్రుడు సుఖంగా ఉంటాడు. నేను సుఖంగా రామా కృష్ణా అంటూ కాలక్షేపం చెయ్యవచ్చు. తర్వాత తీర్థయాత్రలు సేవించవచ్చు. ఇందులో ఏమీ అనుమానం లేదు." ఇలాఅనుకొనే ఆమె సంతోషంతో గోకులుని భార్య అడిగిన వన్నీ తూచా తప్పకుండా వొప్పుకుని వ్యయం మంతా తనే భరిస్తా నని చెప్పి పెళ్ళిసంబంధం కుదిర్చి వచ్చింది. ఇంత వరకూ ఆమె భోజనం చెయ్యలేదు. తల్లి ఎక్కడికి వెళ్ళినా భోంచేసి రా దని అతనికి తెలుసు. బడిపిల్లలకు ఆటవిడుపుఇచ్చి ఇంట్లోకి వెళ్ళాడు. కాని అప్పటిదాకా తల్లి మొదలకుండా ఉండడం చూసి అన్నాడు బృందావన్; "ఆకలితో ఆలోచించినా ఏమీ తేల దమ్మా! ఇతరులసంగతి తరువాత ముందు భోజనంమాట కానియ్యి!"

" వంట రాత్రికి చేస్తాను. నేను నవ్వులాటకు అనడం లేదురా. నా కిప్పుడు తీరిక లేదు. ఆపిచ్చివాడి దగ్గిర పైసా లేదు. నాఅనేవాళ్ళు కూడా లేరు పాపం! తుండుపగ్గిర్నుంచి దేవతార్చనదాకా చేయవలసి వస్తుంది. పెళ్ళికూతురుతల్లి చెడ్డగడుసు మనిషి. ఇతరులమాట వినేఘటం కాదు. అమ్మగో వాడు కూడా వచ్చాడు. నిండా నూరేళ్ళునాయనా నీకు. నీమాటే అనుకొంటున్నాము. ఇలా కోర్చో. అకస్మాత్తుగా వచ్చావే వేళకాని వేళ. ఏమిటి సంగతి?"

నిజాని కిప్పుడు గ్రామాంతరం వెళ్ళేసమయం కాదు. కుంజుడు గదిలోకి రాగానే ఇచ్చిన ఆదరసత్కారాలు చూసి విస్మితుడై కూర్చున్నాడు. బృందావన్ పరిహాసం చేస్తూ "నీకు కబు రెలా తెలిసింది? రాత్రి అయిందాకానైనా ఓపిక పట్టలేకపోయావా?" అన్నాడు. బృందావనంతల్లి మందస్మితురాలయింది. కాని కుంజధ్యాస వీరిమాటలమీద లేదు. అతను కళ్ళు తేలవేసి "అమ్మో! అ దేమి చెల్లెలా ఇన్స్పెక్టరా?" అని నవ్వు ఆపుకొని బృందావన్ "కోడలు ఏదో చెవులో నూరి పోసి పంపిన నట్టుంది" అన్నాడు.

కుంజ ఈ ప్రశ్నలకుసమాధానం ఇవ్వక గంభీరంగా "ఏమమ్మా, నువ్వుకూడా ఎంత పొరపడ్డావు? కనుమ చూడకుండా ఇం కెవరయినాచూస్తే ఏ మయ్యేదో చెప్పు?" తల్లికి ఈ మాటలు అర్థం కాకపోవడంవల్ల విస్తుపోయిచూచింది.

"అసలుసంగ తేమి టన్నయా?" అన్నాడు. బృందావన్ వెంటనే చెప్పి తన ధారం వదల్చుకోడం కుంజనాథుడికి ఇష్టం

లేదు. అందుకని బృందావన్ మాట వినుపించుకోకుండా తల్లితో "సరే కాని తినడానికి ఏం పెడతావో చెప్పు!" అన్నాడు. తల్లి నవ్వుతూ "ఇది మరీ బాగుంది. ఈఇల్లూ వాకిలీ నీది కాదా నాయనా? ఏంకావాలో చెప్పు!"

"సరేలే. ఆసంగతి ఇంకోరోజు చూసుకొందాం. పోయిన వస్తు వేదో మొట్టమొదట చెప్పండి."

ఆమె చింతతో సంకోచంతో "నీ నేమీ పోగొట్టుకో లేదే!" అన్నది. ఈమాటలు విని కుంజు విరగబడి నవ్వాడు. కండువాలోంచి గాజులజత బయటికి తీసి "అయితే ఇవి మీవి కావూ!" అని తర్వాత మహాసంతోషంతో తనలో తనే అర్థంలేని నవ్వు నవ్వుకోవడం మొదలు పెట్టాడు. నిన్న కోడలికి ఆశీర్వదించి తొడిగినమురుగులే ఇవి. ఇవాళ ఆశీస్సులతో మురుగులు బుద్ధిలేని అన్నచేతి కిచ్చి పంపింది. మొదట బృందావన్ గాజులకేసి చూసి తల్లివైపు దృష్టి మరల్చడానికి భయపడ్డాడు. ఆవిడముఖం వివర్ణమై నిర్జీవ మైంది. బృందావన్ మనస్సులో ఏమి జరుగుతున్నదో సర్వాంతర్యామికే తెలుసు. కాని వెంటనే సంబాళించుకొని తల్లికి దగ్గరిగా జరిగి మెల్లగా "అమ్మా! మనవస్తువు తిరిగి దేవుడు మనకు పంపడం మహా భాగ్యం— ఇవి నీచేతి గాజులు. పరాయివాళ్ళు పీటని పెట్టు కోడానికి గుండె లున్నాయా!" అని బృందావన్ కుంజనాథుణ్ణి పిలిచి "అన్నయా! బైటికి వెళ్ళి కూర్చుందాం" అన్నాడు.

కుంజుడు బోళావాడు. అందుకే సంతోషం పట్టలేక ఇంత మారధి నడిచి వచ్చాడు. ఇవాళ గెంటుదుష్టానము లభ్యాడు భోంచేసే

శాక కుసుమ పాలిపోయిన ముఖంతో గాజులు పట్టుకొచ్చి శుష్కమృదుస్వరంతో "నిన్న వారిక్కడ గాజులజత పొరపాటున మరిచి వెళ్ళిపోయారు. కాబట్టి నీ వెలాగయినా వీటిని ఇచ్చేసెయ్యి" అన్నది. ప్రసన్ను డైనకంజనాథుడు చెల్లెలి మ్లానవదనం చూచేఅవకాశం దొరక లేదు. అతనికి డొంక తిరుగుడు వ్యవహారాలు అర్థం కావు. చెల్లెలు చెప్పింది అబద్ధమా? మనుషులు ఇంత విలువయినవస్తువులు పరాయివాళ్ళకు ఇస్తారా? ఒకవేళ ఇస్తే తీసుకున్న వారు నిర్లక్ష్యంగా పంపిస్తారా? ఈప్రశ్నలకు సంబంధించిన అసంభవమైనమాటలు అతని బుద్ధికి అగోచరంగా ఉండిపోయాయి.

పోయినవస్తువు లభించడంవల్ల వారు అకస్మాత్తుగా ఎంత సంతోషపడతారో తనకు ఎన్ని ఆశీర్వాదాలు ఇస్తారో మొదలైనసంగతులు- తోవపొడుగునా ఆలోచించుకొంటూ వచ్చాడు. అయినా అక్కడిదేమీ జరగలేదు. జరిగింది మంచిదవునో కాదో అతను అర్థం చేసుకో లేకపోయాడు. ఇంత ఘనకార్యం చేసినాకూడా బృందావన్ తల్లి ఆశీఃప్రసారం, కనీసం మంచి మాటయినా నోట రానీకపోవడంవల్ల ఉదాసీను డయ్యాడు. బలవంతంగా తల్లిఎదుట ఉండనీక తనను బృందావన్ బైటికి లాక్కురావడంవల్ల అతనికి సిగ్గేసింది. బృందావన్ పెదవులు మెదల్ప లేదు. ఆసమయం నోరు కదిపే ఓపిక కూడాలేదు. జరిగినఅవమానం తనది కాదు, స్వయంగా తల్లిది. అతనికి స్వవిషయంలో ఏచింతా లేదు. మృత్యుయాతన తక్కిన బాధల్ని అణిచి ఒక్కటే ఎలా రాజ్యం చేస్తుందో, అలాగే

మాతృవివర్ణముఖస్మృతి అతనిఆలోచనలను మింగివేసి భీష ణాగ్నిశిఖాసమానంగా జ్వలించడం మొదలు పెట్టింది సంజ చీకట్లు దట్టంగా అలముకొన్నాయి. కుంజుడు మెల్లగా "మం చిది, బృందావన్ అలా అయితే నేను వెళ్ళిపోతున్నాను" అన్నాడు. బృందావన్ వేదనాభరంతో సరే, వెళ్ళు మరోరోజున తప్పక రా అన్నాడు. కుంజుడు వెళ్ళిపోయాడు. బృందావన్ అక్కడే పరుండి. ఆలోచించడం మొదలు పెట్టాడు. తల్లిభావిసుఖ కల్పనలు క్షణంలో బుద్బుదా లయినాయి! తల్లిని ఎలా ఊర డించాలో అతనికి తెలియలేదు. అన్నిటికంటె నిష్ఠురపరిహాసం: తనతల్లి ఆశలను నిర్మూలం చేసి, మాతృ హృదయానికి బాధ కల్పించింది అతని భార్య. ఆమెనేఅతను ప్రేమిస్తున్నాడు.

[ ౫ ]

తనని గుర్తించినవారి ఎదురుగా కటువుగా వుండడంవల్ల ఆమెహృదయం అభూతపూర్వ మైనఆనందంతో పొంగి పోయింది. అంతే కాకుండా విడతీయరాని స్నేహానుబంధం తెంచి గాజుల్ని అన్న చేతి కిచ్చి వ.పినప్పుడు ఆమెకు వేదన పుట్టి అసహ్యంగా తోచింది. వెంటనే గదిలో వచ్చింది. బహుశః ఆమె తన నిష్ఠురాచరణ వారికి ఎంత ఆకస్మికంగా మర్మాంతక వేదన కలిగిస్తుందో ఊహించి ఉంటుంది! చీకటి పడి చాలా సే పయింది. కుంజనాథుడు తిరిగి వచ్చాడు. దీపంలేకపోవడం చూచి చెల్లెలి గదిఎదుట నిల్చి "కుసుమా! దీపం వెలిగించ లేదా!" అన్నాడు.

కుసుమ కొంచెం సిగ్గుతో లేచి నిల్చుని "వెలిగిస్తా అన్నయ్యా! ఎంతసే పయింది నువ్వు వచ్చి?" అన్నది.

"ఇప్పుడే వస్తా" అంటూ కుంజనాథుడు వాలుకా-చిలుమూ వెతికి పొగాకు నింపడం మొదలెట్టాడు. దీపంలో చమురు పోసి వెలిగించేసరికి ఆలస్యం అయింది. వచ్చి చూసే సరికి అన్న వెళ్ళిపోయాడు. ప్రతిరోజులాగే అన్నం వడ్డించి దూరంగా వెళ్ళి కుసుమ కూర్చున్నది. కుంజుడు గంభీరంగా భోజనం చేస్తున్నాడు. రోజూ వాగుతుండేవాడు. ఇవాళ మౌనంగా ఉండడం చూసి కుసుమకు చాలా సందేహం కలిగింది. ఏదో అనుకోని సంఘటన జరిగిందని అనుకొన్నది. అయినా ఏమి జరిగిందో తెలుసుకోవాలని ఆతురతగా ఉన్నది. అన్నను వాళ్ళు అవమానం చేశారేమో! సామాన్యవిషయాలకు కుంజుడు ఇంతగా బాధ పడడని తెలుసు. భోజనం చేసి వెళుతూంటే కుసుమ సహించలేక "అన్నయ్యా, గాజులు ఎవరి చేతి కిచ్చి వచ్చావు?" అని అడిగింది,

కుంజనాథుడు విస్మితుడై "ఇం కెవరి చేతి కిచ్చివస్తాను? తల్లి కే ఇచ్చాను" అన్నాడు.

"ఆవిడ ఏ మన్నది?"

"ఏమీ అనలేదు" అంటూ అతను బయటికి వెళ్ళి పోయాడు.

రెండోరోజు వ్యాపారానికి వెడుతూ కుసుమతో అతను స్వయంగా ఇలాచెప్పాడు. "మీఅత్తకు ఏం రోగం వచ్చిందో ఇలాంటి విలు వయినవస్తువు లిచ్చినా ఒక్కమాటయినా

మాట్లాడ లేదు. ఇంకా బృందావనే మంచివాడు. అతను సంతోషపడుతూ అమ్మా! నీసొమ్ము ఇతరులు పెట్టుకోడానికి ఎంత అదృష్టం చేసుకోవాలి? మనరోజులు బాగున్నాయి. కాబట్టి మనవస్తువు మనకు దక్కింది అన్నాడు. ఆఁ ఇ దేమిటి కుసుమా?"

కుసుమ ముఖం వెలవెలపోయింది. ఆమె గట్టిగా తల తిప్పుతూ ఏమీ లేదు. ఈమాట స్వయంగా వారే అన్నారా? అని అడిగింది.

"అవును వారే అన్నారు. తల్లి నాతో మాట్లాడనే లేదు. అదీ కాక ఆవిడ పొద్దున్నే ఎక్కడికో వెళ్ళిం దట. నేను వెళ్ళే దాకా ఏమీ తిన లేదు. స్నానంకూడా చెయ్య లేదు. మాట్లాడుతోంటే పిచ్చిదానిలా నాకేసి చూస్తూ ఉండిపోయింది. ఇలా అంటూ కుంజుడు వెళ్ళి పోయాడు.

మూడు నాలుగు రోజులు గడిచాయి. వంట తిన్నగా కాలేదు. అందువల్ల అన్నకూ చెల్లెలికీ చాలా జగడం జరిగింది. అన్నం నేలకు విసిరికొట్టి కుంజుడు "ఒకరోజు మాడిపోతుంది, ఇంకో రోజు మెత్త నవుతుంది. ఇప్పుడు నీమనస్సు ఏం చేస్తూంటుంది?" అన్నాడు.

కుసుమ కోపంగా "ఎవరూ కొని పారేసిన బానిసను కాను! నాకు వంట చేత కాదు. బాగా చేసే దాన్ని తెచ్చుకో రాదూ?" అన్నది.

కుంజుడి కడుపు మండిపోతున్నది. చెల్లెలంటే ఇవాళ అతను భయపడ లేదు. చెయ్యి విసురుతూ అన్నాడు. "ముందిక్కణ్ణించి

నడు. తరువాత తెస్తానో తీసుకురానో.'' ఇలా అంటూ మూట తీసుకుని వెళ్ళిపోయాడు.

కుసుమకు చాలా కాలంనుంచీ మనసార ఏడవాలని ఉన్నది. ఇవాళ దొరికిన సుయోగాన్ని ఆమె వదలలేదు. తలుపుతీసి ఉన్నది. వంటింటి గుమ్మంమీద తల పెట్టి ఎవరో చచ్చిపోయి నట్టు ఏడవడం మొదలు పెట్టింది. అప్పుడు సుమారు పది గంటలవుతుంది. గంటసేపు బాగా ఏడ్చి నిద్దరోయి లేచి చూస్తే ఇంటిముందునిలబడి బృందావన్ కేక వేస్తున్నాడు! ''కుంజనాథ్!'' ఆతని వేలుపట్టుకొని అయిదారేళ్ళ కొడుకున్నాడు. కుసుమ విస్మయంతో పైటకొంగు తలమీదికి తీసుకుని తలుపుకు అడ్డుగా నిలబడ్డది. ఆ సమయంలో అన్నీ మరిచిపోయి ఆమె పిల్లాడికేసి చూస్తూ ఉండిపోయింది. పిల్లవాడు తన భర్త కుమారుడని గుర్తించి చూస్తుండగానే ఆమె నేత్రాలు అశ్రుపూరితాలయి నాయి. బాహువులు పిల్లవాణ్ణి ఆలింగనం చేసుకోడానికి వక్షో పంజరాన్ని భేదించుకుని బయటికి రాబోతున్నాయి. అయినా ఒక అడుగు ముందుకువేసి మాట్లాడలేక శిలా ప్రతిమలా రెప్ప వాల్చక పిల్లవాడికేసి చూస్తున్నది. ప్రతి ధ్వని రాకపోవడం వల్ల బృందావన్ విస్మితుడయినాడు. అతను ఇవాళ పొద్దున్న పనిమీద వచ్చి ఇంటికి వెడుతున్నాడు తలుపు తీసి ఉండడం వల్ల కుంజునున్నాడేమోనని లోపలికి వచ్చాడు, అతనితో చాలా అవసరమయిన పని వుంది. బండి బయలు దేరుతూంటే చరణుడువచ్చి ఎక్కాడు. అందుకే ఇప్పటిదాకా వెంట ఉండి పోయాడు బృందావన్ మళ్ళీ పిలిచాడు జవాబు రాలేదు,

నాన్నా చాలా దాహం వేస్తున్నది.' బృందావన్ చికాకు పడుతూ బెదిరించాడు. 'దాహంలేదు ఏమీలేదు. వెళ్ళేప్పుడు చెరువులో తాగ వచ్చు.' పాపం పిల్లవాడు ముఖం ముణుచుకొని ఊరుకొన్నాడు. ఆరోజున కుసుమ సిగ్గునణచి సందేహంలేకుండా బృందావన్ ఎదటపడి అవసరమయిన మాటలు చాలా సహజం గానే మాట్లాడింది. కాని ఈ రోజు ఆమె శరీరమంతా లజ్జతో వివశమవుతున్నది. చరణుడు ఒకవేళ దాహం అడక్కుండా ఉంటే ఆమె ఎలాగయినా బైటికి రాగలిగేదికాదు. కొంతసేపు సందిగ్ధంగా ఊరుకుని తరువాత ఒక చిన్న చాప తెచ్చి వరాం డాలో వేసింది. చరణుణ్ణి ఎత్తుకొని మెల్లగా ఆమె లోపలికి వెళ్ళిపోయింది. బృందావన్ ఈ సంకేతాన్ని తెలుసుకొన్నాడు. కాని పిల్లాడు ఒక పరాయిమనిషి ఒళ్ళోకి ఎలా వెళ్ళాడో అతనికి అర్థం కాలేదు. తన కుమారుని స్వభావం తనకు బాగా తెలును. చరణ్‌కు ఏమీ తోచలేదు కారణం అప్పుడే తండ్రివల్ల చివాట్లు తిని ఉండడం. అదీగాక ఎవరో స్త్రీ తనను అమాంతంగా ఎత్తుకొపోతున్నది. ఇలా అతన్ని ఎవరూ ఇంతవరకూ ఎత్తుకోనూలేదు.

కుసుమ చరణుణ్ణిలోపలికి తీసుకువెళ్ళి కండ చక్కెర తినిపించింది. కొంతసేపు వాడికేసి బాగా చూసి అప్పుడు గుండెలకు కుర్రాణ్ణి హత్తుకొని ఏడవ నారంభించింది. చరణుడు ఆమె కఠిన బాహుపాశంనుంచి వదలించుకోవలెనని చూస్తూంటే కుసుమ కన్నీళ్లు తుడుచుకొని అన్నది. "ఇదేమిటి నాయనా! నేను మీఅమ్మను కదూ!'' కుసుమకు మొదటినుంచీ పిల్లలంటే

పిచ్చి. ఎవరయినా పిల్లవాడు ఆమె దగ్గరికివస్తే ఆమె వాణ్ణి వదిలి పెట్టలేదు. అయినా ఆవేళ ఆమె హృదయంలో పిపాసతో తుపాను ఇదివరలో ఎన్నడూ చెలరేగ లేదు. ఆమె గుండెలు విరిగేలా వున్నాయి. ఈ చక్కని పిల్లవాడు తన కొడుకే అయివుండవలసింది, కాని అలా ఎందుకు కాలేదు? అలా కాకుండా ఎవరు ఆటంక పరిచింది? సంతానంనుండివంచితురాలిని చెయ్యడానికి ఎవరికి అధికారం ఉన్నది? వాణ్ణి కౌగలించుకొంటున్నా ఆమె తృషిత వంచిత మాతృహృదయానికి సాంత్వన కలుగలేదు. బలవంతంగా అన్యాయంగా ఆమె ధనాన్ని ఎవరో దోచుకొన్నారను కొన్నది. కాని చరణుడు కౌగిలి భరించలేక పోయాడు. ఇలా అవుతుందను కొంటే బహుశా చెరువుదగ్గిరే నీళ్ళు తాగేవాడు. వాడికీ బాధ కంటే దప్పిక బాధే సహ్యంగా వుండేది. "వదులు" అన్నాడు. కుసుమ రెండు చేతుల్తో వాణ్ణి తల దగ్గిరికి తీసుకుని అన్నది. "అమ్మా అను. అమ్మాఅని పిలు. నిన్ను దింపుతాను!"

"ఊఁహుఁ" అన్నాడు చరణుడు.

"అలా అయితే దింపను." ఇలా అంటూ కుసుమ తిరిగి వాణ్ణి దగ్గరికి తీసుకుని అదుముతూ ముద్దెట్టుకొని చక్కిలిగింతలు పెట్టింది. "అమ్మా అని పిలవకపోతే దింపనే దింపను!"

"అమ్మా" చరణుడు ఏడుపుమొగం పెట్టుతూ అన్నాడు. ఇప్పుడు వాణ్ణి వదలడం కుసుమకు బొత్తిగా అసంభవమయింది. అలాగే ఏడవడం మొదలెట్టింది.

ఆలస్యమవుతున్నది. అవతలనుంచి బృందావన్ పిలిచాడు.
"ఏమిరా అబ్బాయి నీళ్ళు తాగేవా?"

చరణ్ ఏడుస్తూ జవాబు చెప్పాడు. ఆమె వదిలిపెట్టడమే లేదు. కుసుమ కన్నీళ్ళు తుడుచుకుని గద్గదస్వరంతో అన్నది
"ఇవాళ చరణ్ నాదగ్గరే ఉంటాడు."

బృందావనుడు గుమ్మందగ్గిరనే వచ్చి అన్నాడు "ఎలాగ వుండడం? ఇంతవరకు ఏం తినలేదు. అమ్మ కనిపెట్టుకుంటుంది.

"వాడిక్కడే ఉంటాడు. ఇవాళ నా వొంట్లో బాగులేదు."

"ఏం ఏమయింది?"

కుసుమ ఏమీ జవాబు చెప్పలేదు. "మీరు బండి పంపించెయ్యండి. చాలా ఆలస్యమైంది. నదికివెళ్ళి చరణుణ్ణి స్నానం చేయించి తీసుకువస్తాను." అంటూ ప్రత్యుత్తరం నిరీక్షించకుండానే అంగవస్త్రం చముగుసీసా తీసుకొని కుర్రవాణ్ణి ఎత్తుకొని నదికి వెళ్ళిపోయింది.

ఇంటికి సమీపంలో నిర్మలమైన సెలయేరు ఉన్నది. దాన్ని చూడగానే చరణుడు సంతోషించాడు. వాడి గ్రామంలో ఏరు లేదు. ఎవరూ వాణ్ణి అందులో దిగనిచ్చేవారు కారు. ఇలాంటి అదృష్టం ఇంతకు మునుపు ప్రాప్తించలేదు. రేవు దగ్గిరకూర్చుని నెమ్మదిగా నూనె రాసుకుని మోకాలి లోతు నీళ్ళల్లో దిగాడు. కొంతసేపు గంతులేస్తూ స్నానంచేసి తిరిగి వచ్చేప్పుడు వారిద్దరిలో చిత్రమైన మాతా పుత్రుల సంబంధం ఏర్పడ్డది. కుసుమ కుమారుణ్ణి ఎత్తుకొని నడిచింది. ఆమె నడక

ప్రసన్నంగా ఉంది. ముసుగు నుదుటిని తాకుతున్నది. వెళ్ళేప్పుడు వొంట్లో బాగా లేదన్నది. కాని ఇప్పుడు ఆమె వదనం మీద దుఃఖ చిహ్న లేశమయినా లేదు. పైగా గులాబీ మొగ్గల్లా ఆమె పెదవులు చిరునవ్వుతో విచ్చుతున్నాయి! ఆమె నడవడిలో ఏ సంకోచం కాఠిన్యం లేనేలేదు. నింపాదిగా ఉన్నది. "మంచిది మీరింక వెళ్ళి స్నానం చేసి రండి"

"తరువాత?"

"భోజనం"

"ఆ తర్వాత?"

"కొంచెం విశ్రాంతి తీసుకోవచ్చు"

"అదయ్యాక?"

"పోనిండి నాకేం తెలియదు. ఆలస్యం చెయ్యకండి." ఇలా నవ్వుతూ నవ్వుతూనే అంగోస్త్రం బృందావన్ మీదికి విసిరింది. అంగోస్త్రంపట్టుకుని ముఖంతిప్పి అతనన్నాడు వేడినిట్టూర్పుతో "పైగా నువ్వు ఆలస్యం చెయ్యకు. వాడికేమయినా తినిపించు. నే నెలాగయినా ఇంటికి వెళ్ళాలి."

"ఎందుకు? బండి తిరిగిరావడంవల్ల అమ్మ ఎలాగయినా తెలుసుకొంటుంది—"

"అవును అందుకే బండిపంపలేదు. ఆ చెట్టుకిందే నిలబడి ఉంది." ఈమాటవిని కుసుమ వికసిత వదనం మలినమైంది. అన్నది "అమ్మనడక్కుండా మీరిక్కడికి రావడమే మంచిది కాదు."

గూఢాభిమానంతో వున్న కుసుమ స్వరాన్నివిని బృందావన్ నవ్వినాడు. కాని ఆనవ్వులో ఆనందమేమీలేదు నెమ్మదిగా అన్నాడు "కుసుమా నేనెలా పెరిగానంటే అమ్మ ఆజ్ఞలేకుండా మీ ఇంటికే కాదు మీ వూరికే కూడా రాలేను— అయినా పోనీలే. గతించినదాన్ని తల్చుకుని ప్రయోజనంలేదు. వెళ్ళు ఆలస్యం చెయ్యకు. కుర్రాడికి భోజనంపెట్టు."
ఇలా అని బృందావన్ చాపమీద కూర్చున్నాడు.

కుసుమ కష్టంతో కన్నీళ్ళు ఆపుకుని కుర్రాణ్ణి తీసుకుని నిశ్శబ్దంగా గదిలోకి వెళ్ళిపోయింది.

గంట తర్వాత తండ్రీ కొడుకులు బండిలో కూర్చుని ఇంటికి వెళ్ళేప్పుడు తోవలో చరణ్ అడిగాడు "నాన్నా అమ్మ అంతగా ఏడుస్తుందేం!" బృందావన్ ఆశ్చర్యముతో అడిగినాడు. "ఏంరా ఆమె అమ్మని ఎవరు చెప్పారు?" చరణ్ బిగ్గరగా అన్నాడు, "ఆమె ఎలాఅయినా అమ్మే! ఏం కాదానాన్నా?"

బృందావన్ దీనికేమీ ప్రత్యుత్తరం ఇవ్వకుండా అడిగినాడు "నువ్వుమీ అమ్మదగ్గరుంటావా?" చరణుడు సంతోషంతో తలతిప్పుతూ అన్నాడు "ఓ ఉంటాను."

"అలాగే" అంటూ బృందావన్ బండిలో ఒకవైపు ముఖంతిప్పి పడుకుని సూర్యకాంతి మయమైన నిర్మలాకాశం వైపు చూడసాగినాడు.

రెండోరోజు ఏటికినీళ్ళు తేవడానికి వెడుతూ కుసుమ వాకిట తలుపు గొళ్ళెం పెడుతూ ఉన్నది. ఇంతలో పన్నెండు పదమూడేళ్లవాడు ఇటూ అటూచూస్తూ దగ్గరికివచ్చి అడిగాడు. "నువ్వు కుంజనాథ్ ఇల్లు చూపెట్టగలవా?"

"చూపగలను. ఎక్కణ్ణించి వచ్చావు?"

"బాడల నుంచి పండిత్ జీబాబు పంపారు." ఇలాఅంటూ ఆపిల్లవాడు చాలా కాలం కిందట తెల్లగావున్న ఉత్తరీయం లోంచి ఒకజాబుతీసి చూపించాడు. కుసుమ శరీరంలో ఉష్ణ రక్తం ఒక్కసారి ప్రవహింప సాగింది. పైన ఆమె పేరున్నది బృందావన్ రాశాడు. దాన్ని చదవడానికి ఉన్న కుతూహలం బలవంతంగా ఆపి పిల్లవాణ్ణి లోపలికి తీసుకువెళ్లి అడిగింది. "మరెవర్ని పండిత్ జీ అంటున్నావు? ఉత్తరం ఎవరిచ్చారు?

- "పండిత్ జీ ఇచ్చారు" కుసుమకు బడి సంగతి తెలియదు. అందుచేత ఆమె కొంచెమైనా తెలుకోలేకపోయింది.

"నీకు చరణ్ తండ్రిని తెలుసా?"

"ఆయనే పండిత్ జీ"

"నువ్వు ఆయనదగ్గిర చదువుకుంటున్నావా?"

"నాతో పాటు ఇంకా చాలా మంది చదువుకొంటున్నారు." కుసుమ ఎన్నో ప్రశ్నలు వేసి సంగతి సందర్భాలన్నీ తెలుసు కొన్నది. పాఠశాల పండితజీ ఇంట్లోనే. దాన్లో పిల్లలకు జీతాలు లేవు. పండితజీ స్వయంగా పుస్తకాలు పలకలూ కొని ఇస్తున్నాడు. పగలు అవకాశం దొరకని బీదపిల్లలు సాయంత్రం చదువుకు వస్తారు. దేవుడికి నైవేద్యం కాగానే అంతా ప్రసాదం తీసుకుని నవ్వుతూ ఇంటికి వెడతారు. ఇద్దరు పెద్దలుకూడా ఉన్నారు. వారు పాఠశాల్లో ఇంగ్లీషు నేర్చు కొంటున్నారు! ఇంకా ఇలాంటి వెన్నో కుసుమ తెలుసుకొన్నది. శనగపప్పు పంచదార చిలకలూ ఇచ్చి వాణ్ణి పంపి ఉత్తరం విప్పి

చదవసాగింది. కుసుమ సుఖస్వప్న శాఖ ఎవరో గొడ్డలితో వేటు వేసిన ట్లయింది. జాబు ఆమెకే. కాని అందులో ఏలాటి సంబోధనమూ లేదు. సుహృత్ భావం వెలిబుచ్చ లేదు. చివరకు ఒక ఆశీర్వాద మయినా లేదు. పైగా ఇదే మొదటి జాబు. ఇంతకుముందు ఈమెకు ఎవరూ జాబులు పంపలేదు. కాని తన సఖుల దగ్గిర ఎన్నో జాబులు చూచింది. ఆ ఉత్తరాలకూ దీనికీ ఎంత భేదం ఉన్నది? దీనిలో తుదకూ మొదలూ ఏవో వ్యవహారం మాటలు. ముఖ్యవిషం కుంజుడి పెళ్ళి. ఇది చెప్పడానికే మొన్న బృందావన్ వచ్చాడు. ఈ వివాహం తనతల్లి నిశ్చయం చేసిందని అతను రాశాడు. ఇంకా పెళ్ళి కర్యే ఖర్చంతా ఆవిడే భరిస్తుంది. అన్నివిధాలా ఈ వివాహం కావడం అవసరం. దీనివల్ల కుంజనాథుడికే కాకుండా కుసుమకుకూడా కష్టాలు గడ్టెక్కనాయి. ఈ సంగతి జాబులో దాదాపు స్పష్టమయింది. ఒక్క పర్యాయం సమాప్తి చేసి తిరిగి చదవడానికి ఆమె ప్రియత్నం చేసింది. కాని ఈసారి అక్షరా లన్నీ ఆమెకళ్ళ ఎదుట నృత్యం చేయసాగినవి. తనకు చేకూరబోయే సౌభాగ్యం ఆమెకు అణుమాత్ర మయినా ఆనందాన్ని ప్రసాదించ లేకపోయింది.

[ ౬ ]

సుమారు నెల గడిచింది. కుంజనాథుడి వివాహం అయింది. ఆరోజునుంచిబృందావన్ తిరిగి రాలేదు. పెళ్ళినాడుకూడా జ్వరం వచ్చిం దనే సాకుతో రాలేదు. అతనితల్లి చరణుని మాత్రం తీసుకుని ఒకరోజే ఉన్నది. ఆమె గృహ దేవతను వదిలి మరో

చోట ఉండలేదు. చరణుడు మాత్రం అయిదారు రోజులున్నాడు తనుకోరిన అమ్మదొరికినందువల్లనయితేనేమి ఏటిలోస్నానం చేసినసరదాతో నైతేనేమి వాడింటికి వెళ్ళదలుచుకోలేదు. తర్వాత బలవంతంగా తీసుకు పోవలసివచ్చింది. అప్పణ్ణించి కుసుమజీవితం దుర్భర మైపోయింది. వివాహానికి ముందు కుసుమకు ఏసందేహాలు కలిగాయో అవన్నీ అక్షరాలా నిజము అయ్యేట్టు కనిపించాయి. ఆమెకు తనఅన్న స్వభావం బాగా తెలుసు. దరిద్రదేవతా నిలయమైన ఈఇల్లు వదిలి అన్న అత్తారింటికి వెళ్ళి వుంటాడని ఊహించింది. సరిగా అలాగే జరిగింది. ఎవరిసాయంవల్లనైతే కుంజనాథుని పెళ్ళి అయిందో వారిని వంచించడం అతనికి ఇష్టం కాలేదు. 'నలడంగా' వాళ్ళు వింటే ఏమంటారు? పెళ్ళిసమయంలో బృందావన్‌తల్లి కానుకగా కొన్ని రూపాయలు రొక్కం ఇచ్చింది. వాటితో కొన్ని వస్తువులు కొని బజార్లో పందిరి వేసి దుకాణం తెరిచి కూర్చున్నాడు. కాని ఒక్క పైసా అయినా అమ్మకం కాలేదు. ఒక నెల్లోనే కొత్తబట్టలు కొత్తబూట్లు తొడుక్కొని అతను అత్తారింటికి వెళ్ళి వచ్చాడు. మొదట్లో అతను కుసుమఅంటే చాలా భయపడేవాడు ఇప్పుడదేమీ లేదు. ఇంట్లో బియ్యం, పప్పు లేవని అనడంతోటే దుకాణానికి వెళ్ళి కూర్చుంటాడు. అదీ కాకపోతే ఎటయినా జారిపోతాడు. ఇంక ఆరోజల్లా ఇంటి ముఖం చూసేవాడు కాదు. నాలుగువైపులాచూసి కుసుమ భయపడ్డది. దగ్గిరఉన్న కొద్దిడబ్బు ఖర్చయి పోయింది. కుంజనాథుడు కళ్ళు తెరవలేదు. కొత్తగా తెరిచినదుకాణంలో పాగ

తాగుతూ కూర్చుంటాడు. నలుగురు చేరగానే అత్తారింటి మాటలు చెప్పడం కాకుండా, తనకు కొత్తగా కలిసిన ఆస్తి వివరాలు లెక్కలు కడతాడు.

ఆరోజు కుంజుడు ఉదయాన్నే లేచి కొత్తగా పాలిష్ వేసినజోళ్ళను నూనెమెరుగుతో మెరిపించాడు. కుసుమ వంటింట్లోంచి వచ్చి కొంతసేపు నిలవబడి "నలడాంగా వెడుతున్నావా" అన్నది. కుంజుడు ఊఁ అని తలఊపి బూటుపాలిష్‌పనిలో మగ్నుడయ్యాడు.

కొంతసే పాగి కోమలస్వరంతో కుసుమ "అన్నా మొన్ననే కదూ నువ్వు వెళ్ళింది? ఇవాళ వెళ్ళి చరణ్ణిచూసి రావూ? చాలారోజులనుంచి పిల్లవాడిక్షేమం తెలియడం లేదు నాకు ఎలాగో వుంది." అన్నది.

కుంజుడు విసుగుతో "వాడు చాలా బా గున్నాడు" అన్నాడు.

కుసుమకు కోపంవచ్చినా అణుచుకొని "బాగుండనీ. అయినా ఒక్కసారి వెళ్ళి చూసిరా? అత్తారింటికి రేపు వెళ్ళవచ్చు." అన్నది.

కుంజుడు కోపంతో "రేపు వెళ్ళడం ఎలా? అక్కడ మొగదిక్కు లేరు. ఇల్లూ వాకిలీ భూమీపుట్రా కనుక్కొనేభారమంతా నానెత్తినే పడింది. ఒంటరివాణ్ణి నే నెక్కడికి వెళ్ళను" అన్నాడు.

అన్నమాటలధోరణి విని కుసుమ కోపంతో నవ్వుతూ "కాదన్నయ్యా! నువ్వన్నీ చూచుకోవచ్చు నీకాళ్ళమీద పడతాను.

ఇవాళ ఒక్కసారి వెళ్ళిరావూ? ... ఎంగాకో గాని నాకు వాడియోగక్షేమం తెలుసుకోవా లని ఉన్నది.” అన్నది కుంజుడు కాలిజోళ్ళు జరుపుతూ అతిశయంతో “నేను వెళ్ళ లేను, బృందావన్ నాపెళ్ళికి రాలేదు. మహాగొప్పవా డయినట్టు నాపెళ్ళికి రావడానికి తీరిక లేకపోయింది పాపం!’’ అన్నాడు. కుంజుడిమాటలు కుసుమకు అసహ్యంగా తోచాయి. ఆమె నెమ్మదిగా “ఆరోజు వారికి జ్వరం.” అన్నది. “జ్వరం లేదు. వట్టిది. అంతా అబద్ధం. కృతఘ్నుడు అంతా వాడినే అంటారు. వాడిమొహం చూడను.” అంటూ కుంజనాథుడు గంభీర భావంతో నిల్చుని బూట్లు తొడుక్కున్నాడు. కుసుమ నిశ్శబ్దంగా ఉంది.

“వారు విశ్వాసఘాతకులు. భోజనానికి పిలిచి పారిపోయావేం అన్నయ్యా? నువ్విలా అయిపోతా వని నేను అనుకోలేదు. ఈ మాటలకు కుంజుడుదగ్గర్నుంచి ప్రత్యుత్తరం లేదు. ఏమీ విననట్టు నిలవబడ్డాడు.

“ఏ దయితే ఇల్లూ వాకిలి అనుకుంటున్నా వో అది ఎవరిది? నీకు పెళ్ళిచేసిం దెవరు?’’

కుంజుడు ముఖం తిప్పి “ఒకడు చేసే దేమిటి? మాఅత్తగా రంటుంది మొగ్గలు విచ్చుడాన్ని ఎవరు ఆపుతారు? పెళ్ళి దానంతట అదే తోసుకొస్తుంది.’’ అన్నాడు.

“అలానే అవుతుంది!” కుసుమ ఇం కేమీ మాట్లాడక గదిలోకి వెళ్ళిపోయింది సిగ్గూ కోపం ఆమెహృదయాన్ని జ్వలింపచేస్తున్నాయి.

సుమారు అరగంట తర్వాత జోళ్ళ టకటక శబ్దం విని కుసుమ బైటికి వచ్చింది.

"ఎప్పుడొస్తావు?"

"రేపు ఉదయాన్నే"

"ఇలా నన్ను ఒంటరిగా వదిలి వెళ్ళడానికి సిగ్గులేదా?" అన్నది కుసుమ.

"ఇక్కడేమీ పెద్దపులి వుందా నిన్ను మింగడానికి? ఉదయం వస్తాను" అంటూ కంజుడు వెళ్ళిపోయాడు. కుసుమ వంటింట్లో మండేపొయ్యిలో నీళ్ళు పోసి మంచంమీద పడి పోయింది.

[ ౨ ]

బృందావన్ తల్లిదగ్గిరికి పోయి "అమ్మా, నన్ను క్షమించి దాసీదాన్ని కుదర్చడానికి వొప్పుకో... చచ్చేదాకా నువ్వీ చాకిరీ చేయడం నా కిష్టంలేదు." అంటే పూజాగృహంలో పని చేస్తున్నతల్లి తల ఎత్తి "ఏం చేస్తావు?" అని అడిగింది.

"నీకోసం దాసీదాన్ని తెస్తాను. అది చరణుణ్ణి పెంచుతుంది. నీకు సేవ చేస్తుంది. అవసరమయితే గౌరాంగుణ్ణి పూజిస్తుంది. ఏమమ్మా!" అంటూ బృంద తల్లిముఖం కేసి చూచాడు. తల్లి కుమారునిమాటల్లో వున్న అంతరార్థం గ్రహించింది. స్వజాతి వాళ్ళు కాక సాధారణదాసి ఈ ఇంట్లో అడుగు పెట్టలేదు. కొంచెంసేపు ఆగి తల్లి "నిజమేనా?" అన్నది.

"నీదగ్గిర అబద్ధం ఎందుకమ్మా?"

"మంచిది. బాగా ఆలోచించు." అంటూ అతని తల్లి నవ్వుతూ పనిచేటల్లో ఉన్నది.

"ఆలోచించడం కుదరదమ్మా. నీ అనుజ్ఞ తీసుకొని బయటికి వెళ్ళాలని వచ్చాను."

"ఆలోచించాలి."

"దానికో కారణం ఉందమ్మా. నేను మంచీ చెడూ చూడడం లేదు. నీ అనుమతి చాలు."

తల్లి తలెత్తి "నేను అనుమతి ఇచ్చినప్పుడు నువ్వు వొప్పుకో లేదు" అన్నది.

"నాకు తెలుసు. ఆ పాపానికే నా ప్రాయశ్చిత్తం బాగా అయింది" అంటూ బృంద తల వంచుకొన్నాడు. పుత్రుడు ఈ ప్రస్తావన తనసుఖము కోసం చేశాడు. అతను చెప్పినట్లు చేస్తే ఏ మవుతుందో ఆలోచించగానే ఆమె నేత్రాలు అశ్రుపూరితా లయినాయి. ఆమె టూకీగా "ఉండనీ రా నాలుగురోజు లయ్యాక చెపుతాను" అన్నది.

అతను పట్టుదలగా "నువ్వు ఎన్నాళ్ళకైనా చెప్ప లేవమ్మా! నిన్నవమానం చేసినవాళ్ళను ఇష్టమైతే క్షమించు కాని నేను సహించ లేనమ్మా! నా కేదో చెప్పు. సుఖంగా వుంటాను" అన్నాడు. తల్లి తలెత్తి ఆలోచించి నిట్టూర్పు విడిచి, "మంచిది, వెళ్ళు. అనుమతి ఇస్తున్నాను" అన్నది. బృందావన్ ఆ వేడి నిట్టూర్పులో వున్న భావాన్ని గ్రహించి కూడా ఏమి పలక లేదు. ఆమె పాదరజాన్ని తీసుకుని గది బైటికి వచ్చి నిలుచున్నాడు. ఇంతలో బిడికగ్రాడు వచ్చి చీటీ ఇస్తూ "పండిత్ జీ,

ఇది మీ చీటీ!'' అన్నాడు. తల్లి ఆప్యాయంగా "ఎవరు నాయనా, రాసింది?'' అని అడిగింది.

"చూస్తూనా నమ్మా" అంటూ అతను అన్యమనస్కుడై గదిలోకి వెళ్ళి చదువ మొదలు పెట్టాడు. ఎవరో స్త్రీ రాసిన సుందరాక్షరాలు: ముత్యాలలా ఉన్నాయి పైన "శ్రీచరణ కమలేషు" అని వుంది. కాని కిందస్వాహస్తాక్షరాలు లేవు. ఇంతకు పూర్వం కుసుమ దస్తూరీ చూడ లేదు. కాని ఆమె రాసిందే నని అనుకొన్నాడు. "మీరు మా అన్నను బహుశః గుర్తించ లేరు. ఎందుకలా మారిపోయాడో ఎవరూ చెప్పలేరు. మీతో చెప్పడానికి కూడా నేను సిగ్గుతో చచ్చిపోతున్నాను. ఇవాళ అతనుమళ్ళీ అత్తారింటికి వెళ్ళాడు. రేపు ఉదయం వస్తాడు. రాకపోవచ్చు కూడా ఎందుకంటే, నన్ను తినడానికి ఇక్కడ పెద్దపులులు లేవని చెప్పిపోయాడు. చరణుణ్ణి చూసి రమ్మ న్నాను. విన లేదు——"

ఆమె ఉదయం అన్నతో తగాదా పడి పొయ్యి అర్పిమళ్ళీ రాజెయ్య లేదు. ఉపవాసం ఉన్నది. చింతతో ఇంట్లో కొన్ని వందలసార్లు అటూ ఇటూ తిరిగింది. సంజెవేళ కూడా ఎవరూ రాలేదు. ఆఇంట్లో బిక్కు బిక్కు మంటూ ఒంటరిగా ఉండా లని తెలుసుకున్నది. ఆమెశరీరం పదేపదే రోమాంచిత మవుతున్న సమయంలోనే చరణ్ అమ్మా అమ్మా అని బిగ్గరగా పిలవడం విన్నది. ఆసమయంలో లోతునీటిలో మునుగుతున్న శరీరం భూమిమీద పాదాలు మోపి నిలిచిన ట్లయింది. పరు గెత్తుతూ బైటికి వచ్చి చరణుణ్ణి వడిలోకి తీసుకుని ముఖాన

ము ద్దెట్టుకొంటూ ఒకేభావం పునశ్చరణ చేసింది: "నేను ఒంటరిదాన్ని కాను." చరణ్ సేవకునివెంట వచ్చాడు. రాత్రి భోజనా లయ్యాక కుంజనాథ్ క్రొత్తదుకాణంలో వాళ్ళు పరున్నారు. శయ్యపైన కూర్చుని చరణుణ్ణి దగ్గిరికి తీసుకొని కుసుమ అనేకప్రశ్నలు కురిపించింది. చివరకు నెమ్మదిగా "ఏమిరా చరణ్, నాన్నగారు ఏంచేస్తున్నారు?" అని అడిగింది. చరణుడు చప్పున లేచి వెళ్ళి తనకోటుజేబులోంచి పొట్లం తీసుకొని వచ్చి "అమ్మా, నేను మరిచిపోయాను. నాన్నగారు దీన్ని నీ కిమ్మన్నా రే!" అన్నాడు. కుసుమ పొట్లంచూడగానే తెలుసుకొన్నది. అందులో రూపాయిలు ఉన్నాయి "నాన్న గారు ఎక్కడికి వెళ్ళిపోయారు?" అని కుసుమ విచారంతో అడిగింది కురివాణ్ణి. చరణుడు చె య్యెత్తి చూపాడు "అలా వెళ్ళాడు" అని.

"ఏరు దాటి వచ్చారా?"

"ఆఁ వచ్చా రమ్మా"

కుసుమ మ రేమీ ప్రశ్నించ లేదు. అభిమానంతో ఆమె నిశ్శబ్దంగా కడుపులో కాళ్ళు పెట్టుకుని పరున్నది. ఆరోజు రెండుజాము లప్పుడు గుర్కాడు నీ ళ్ళయినా తాగకుండా చరణుణ్ణి తీసుకు పోయాడు. ఆమెకూడా కోపంవల్ల బతిమాల లేదు; పైగా కటు వైనమాటలు కూడా అన్నది. అప్పణ్ణించి బృంద ఒక్కసా రయినా కనపడ లేదు, అదివరకు ఈతోవను రావడానికీ పోవడానికీ ఎన్నో పను లుండేవి. కుసుమ అతని కోసం ఎలాఎదురు చూస్తున్నదో, రోజులు ఎలా కళ్ళుమూసు

కుని వెళ్ళబుచ్చుతున్నాడో ఒక్క అంతర్యామికే తెలుసు. తోవనే వెళ్ళేబండిచప్పుడు వినగానే ఆమెశరీరంలో వేడిరక్తం ప్రవహిస్తునంది. రెప్పపాల్చకుండా చూస్తూ వుంటుంది! అత్తగారి కిమ్మని గాజులజత పంపించినరోజు జ్ఞాపకం వచ్చింది. ఆలోచనలో పడ్డది "పదేపదే వారిని దెప్పిఅత్తయ్యను అవమానం చేశాను" ఆ దిక్కుమాలినమతి ఆరోజు ఎందుకలా వకరించిందో తెలియదు. ఇంతకాలంనుంచీ ఏసంబంధాన్ని స్వీకరించడం లేదో ఆవిషయంలో ఆమెశరీరం విద్రోహం చేస్తున్నది. కుపితురాలై తర్కించడం మొదలు పెట్టింది "ఏం" నే నేమైనా చేసుకున్నసంబంధమా కాదూ గీరూ అంటే వెళ్ళడానికి? ఆయన నాభర్త కాకపోతే నాహృదయంలో వున్న కోర్కెలు ఆయనమీదనే ఏకాగ్రంగా ఉంటున్నాయేం? కేవలం ఒకనాటి తుచ్ఛసంభాషణలతో, ఒకేనాటి సేవతో వారిపైన ఇంతప్రేమ ఎక్కణ్ణించి వచ్చింది? ''

ఆమె తరుచుగా అనుకొనేది: పూర్వం అంతా అసత్యం. గట్టిగా చెప్పగలను. నానెత్తిన మోపినఅపవాదు లన్నీ వట్టివి. "అమ్మ తీరనిఅపవాదజ్వాలలో తప్పిపోయి తీరనికళంకాన్ని నాకు రుద్దిపోయింది. కొంచెంసేపు ఊరుకుని మళ్ళీ అనుకొనేది: అమ్మ చచ్చిపోయింది నిజం అబద్ధం తేలడానికి ఏదారీ లేదు నేను ఆయనకు ధర్మపత్ని నని తెలుసు. అయితే నాఅవమానం చూసి కూడావమానంగా ఎందు కున్నారు? గర్వాన్ని లెక్క చెయ్యకుండా బలవంతంగా న న్నెందుకు లాక్కుపోరు? నేను ఎవర్ని అడ్డుపెట్టడానికి? నేను వద్దన్నా వూరుకోడం ఎందుకు?

వెంటనే ఆమె దేహం వణికిపోయింది. ఆమెను కౌగలించుకుని పరున్న చరణుడికి నిద్రాభంగం మయింది.

"ఏమిటే అమ్మా?" అని అడిగాడు. కుసుమ వాణ్ణి గట్టిగా కౌగలించుకొని నెమ్మదిగా అడిగింది.

"ఏం రా? నీకు నాన్నగారంటే ఎక్కువ ఇష్టమా, నేనంటే నా?" అని చరణ్ వెంటనే "నువ్వే" అన్నాడు.

"పెద్దవాడి నయ్యాక తినడానికి నా కేమన్నా ఇస్తావా అబ్బాయి!"

" ఓ "

"నాన్నగారు వెళ్ళగొడితే నన్నుండ నిస్తావా?"

"తప్పకుండా"

కుసుమకండ్లవెంట జలజల నీళ్ళు తిరిగి రాలినవి. చరణుడు కళ్ళు మూయగానే ఆమె కన్నీళ్ళు తుడుచుకుని వాణ్ణి చూస్తూ నా కేంభయం? వీడు నాకొడుకు. ఎవరు వెళ్ళగొట్టినా వీడు నాకు ఆశ్రయం ఇస్తాడు! అనుకొన్నది.

రెండోరోజు సూర్యోదయానికి పూర్వం నదినుండి మాతా పుత్రులు తిరిగి రాగానే ఇంట్లో వారి కొక ప్రౌఢస్త్రీ కనిపించింది. ఆమె వసారాలో కూర్చుని రకరకాల ప్రశ్నలు వేస్తుంటే కుంజ నాథుడు వినయపూర్వకంగా యథాయోగ్యంగా సమాధా నాలు ఇస్తున్నాడు. ఆమె కుంజుని అత్త. ఆమె కేవలం కుతూ హలంతో రాలేదు ఈ ప్రదేశం ఎప్పుడయినా తన కూతురు రావడానికి వీ లయింది కాదో తెలుసుకోడానికి వచ్చింది. కుసుమ వస్తూంటే ఆమె ముఖం చూచి చకితురాలైంది.

యౌవనశ్రీలు ఆమె తడిబట్టలో ఒదిగి వుండ లేక పోతున్నాయి. మేలిమిబంగారుకాంతి తడిబట్టల్ని దూసుకుని బైటికి వస్తున్నది. కేశపాశము పాదాలను స్పృశిస్తున్నది! ఎడమవైపు బుజంమీద బిందెవున్నది. కుడివైపు చేత్తో చరణుని ఎడమ చేయి పట్టుకొని ఉన్నది. చరణుడి చేతిలో నీళ్ళ చెంబు న్నది. ప్రపంచంలో ఇలాటి మాతృమూర్తి సాధారణంగా కనపడదు. కనపడ్డా ఆమెవైపు ఆశ్చర్యంతో అంతా చూడక తప్పదు. కుంజనాథుడు కూడా రెప్పవాల్చక ఆమెకేసి చూస్తున్నాడు. ఈ సంగతి తెలిసి ఆమె సిగ్గుపడ్డది. ఆమె త్వరగా లోపలికి వెళ్ళగానే కుంజుడిఅత్త బిగ్గరగా "ఈ అమ్మాయేనా కుసుమ?" అన్నది.

కుంజుడు ప్రసన్నుడై "ఔనమ్మా! మాచెల్లెలు అన్నాడు. కుసుమ నీళ్ళబిందె అక్కడే పెట్టి నమస్కారం చేసింది. తల్లిని అనుకరిస్తూ చరణ్ కూడా నమస్కరించాడు. ఆమె "ఈ అబ్బాయిని నే నెక్కడో చూసినట్టుంది." అన్నది. పిల్లవాడు వెంటనే తన పరిచయం చేశాడు. "నా పేరు చరణ్. మా అమ్మ వెంట మామయ్యకు భార్యను చూడ్డానికి మీ ఇంటికి వచ్చాను." కుసుమ స్నేహపూర్వకంగా నవ్వుతూ చరణ్ణి దగ్గరకు తీసుకున్నది.

"అలా అనకూడదు నాయనా! అత్తయ్యను చూడ్డానికి వచ్చానని అనాలి."

"బృందకొడుకులా ఉన్నాడు." అని కుంజుడిఅత్త అన్నది. బొటనవేలిని చిటికినవేలినీ కలిపి చూపిస్తూ "ఇంతవున్నాడో

లేదో వీని కెన్నిమాటలు" కుసుమముఖం మలినమైంది. గర్విష్టుడివైపు చూచింది. తర్వాత బిడ్డ నెత్తికొని పిల్లవాణ్ణి చేత్తో పట్టుకుని ఆమె వంటింటివైపు వెళ్ళిపోయింది. చెల్లెలి స్వభావం అతనికి బాగా తెలుసు. ఆమెమనోభావాన్ని గుర్తించి అతను విచారపడ్డాడు. కుసుమ ఎలా అయినా ఇలాంటి మాటలు భరించలే దని అతను తెలుసుకొన్నాడు. అతని అత్తకూడా లోలోపల సిగ్గు పడ్డది. పాపం ఆమె ఇలా అనాలని తలచ లేదు. కేవలం అభ్యాసదోషంవల్లనే నోటినుండి వెలువడ్డవి మాటలు.

కుంజునిఅత్తకు నలభైయే ళ్ళుంటాయి. చీరకు అంచులేమీ లేవు కాని మెళ్ళో బంగారుగొలుసూ, చెవులకు దుద్దులూ, బాహువులకు దండకడియాలు ఉన్నాయి. తనఅత్తగారితో ఈవిణ్ణి పోలిస్తే అసహ్యం వేస్తుంది. వాళ్ళు ఏదో మాట్లాడుకొంటున్నారు. వినిపించకపోయినా తనవిషయమే మాట్లాడుకొంటున్నా రని కుసుమ తలచింది. కుంజుడిఅత్త కారాకిళ్ళీలు అధికంగా నములుతుంది. స్నానం చేసి ఆమె తిలకము తీర్చి దిద్దుకొన్నది. ఈ రెండుఅనుష్ఠానాలకూ కావలసిన సరంజామా తెచ్చుకొన్నది. ముఖం చూసుకోడానికిఅద్దం మరిచిపోలేదు. కుసుమ నిత్యపూజావిధి నెరవేర్చి వంటకానికి కూర్చోగానే ఆమెకూడా దగ్గిరికి వచ్చి కూర్చుని అటూ ఇటూ చూచి నవ్వుతూ "ఏమమ్మా! నిమెళ్ళో తులసిమాల లేదు. చందన చర్చ చెయ్యలేదు. నువ్వు ఎలాంటి వైష్ణవులపిల్ల వమ్మా" అన్నది. "నే ని నిన్న గోవిందదాసు" అని కుసుమ ముఖం తిప్పి

"మీకు వేరేవంట చెయ్యనా?" అన్నది.

ఆమె "నా దేమిటి? నే నింటిదాన్నే కద. పరాయివాళ్ళు ఎవళ్ళూ తినరుగద." అన్నది. కుసుమ ఏమీ అనలేదు. కుంజుడు వచ్చి "చరణు ఎప్పుడు వచ్చాడు కుసుమా?" అని అడిగినాడు.

'నిన్న సాయంత్రం!

కుంజుడిఅత్త "ఇప్పుడే విన్నాను. బృంద వైష్ణవుడు ఈమెను ఏల డని. కాని పిల్లాణ్ణి నౌకరుచేతి కిచ్చి పంపాడు." అన్నది.

కుంజ చకితుడై "ఎలా తెలిసింది?" అన్నాడు. అత్త గంభీరంగా "నాకు నాలుగుకళ్ళూ నాలుగుచెవులు విన్న దంతా నిజం. పాపం తెలిసేట్టు చెప్పారు. బతిమిలాడారు, బుజ్జగించారు. కాని నీచెల్లెలు వినిపించుకో లేదు. లోకులు ఇష్టం వచ్చినట్టు అంటారు. వీధిలో మంచివయసువా ళ్ళున్నారు. నీచెల్లెలు ప్రాయంలో ఉంది మనస్సూ ముత్యమూ ఒకేరకం. కాలుజారడానికి, మనస్సుచెడడానికీ ఎంతకాలం అల్లుడూ! అన్నది. కుంజుడు సమర్థిస్తూ "నిజమే అత్తా" అన్నాడు. కుసుమ వెంటనే తలెత్తి కళ్ళతో బెదిరిస్తూ "అన్నయ్యా, నువ్వొక్క ణ్ణించి లేచిపో. చేస్తున్నప నేమిటి?" అన్నది. అతను లేస్తూంటే అత్త కోపంతో "అన్నను పొమ్మనగానే ఇతర్లకళ్ళకు పొరలు రావమ్మాయి నువ్విప్పుడే స్నానం చేసి తల విరియబోసుకుని తడిచీరతో వచ్చావే. కావాలంటే మీఅన్ననే ప్రమాణం చేసి చెప్ప మను. నిన్నాస్థితిలో చూచిన మునులమనసు కూడా చలిస్తుందో చలించదో." అన్నది. కుసుమ బిగ్గరగా "అన్నయ్యా వెళ్ళిపో. మాటలువినకు." అని కేక వేసింది.

ఆమె కేక విని ముఖం కళ్ళూ చూచి కుంజుడు భయపడి పరుగెత్తాడు. కుసుమ పొయ్యిమీదనుంచి కూరగిన్నె టఫీ మని దింపి పడేసింది. వంటింట్లోంచి త్వరగా బయట పడ్డది. కుంజుని అత్తముఖం నల్లపడ్డది. ఆమె అక్కడే కూర్చుండి పోయింది. తనను మించిన కలహయోధ ప్రపంచంలో ఎవరూ లేరని ఇదివరలో అనుకొనేది ఆమె కలలోకూడా బీదపిల్ల ఇంత నిర్లక్ష్యం చేసి వెడుతుం దని అనుకోలేదు.

[ ౮ ]

కారణం ఏమిటో ఊహించలేక పోయినా, అన్న అత్తతనతో తగవు పెట్టుకోడానికే వచ్చిందని కుసుమ తలచింది. ఆవిడ మాటల వల్ల కుసుమ ఏదో ప్రత్యేక కారణంచేతనే బృందావన్ పిలిచినా వెళ్ళలే దని తేలుతున్నది. ఆగూఢకారణం ఏమిటో తెలుసు. బృందావన్ కూడా ఇలాంటిమాటలు ఆధారంగా తీసుకొనే తనను తీసుకు పోలే దనీ, అణుమాత్రం అందుకు సందేహం లేదనీ తలచి విషాదంలో కుమిలిపోయింది. అయినా వంటింటిలోంచి ఇలా లేచి రావడం ఆమెకు మంచిగా తోచలేదు.

కుంజునిఅత్త పగలు భోజనం మానేసింది; చివరకు ఎంతో బతిమాలించుకుని రాత్రి అన్నం తిన్నది. ఆమెఅభిమానం రక్షించడానికి కుంజనాథుడు చెల్లెల్ని ఇష్టం వచ్చినట్టు తిట్టాడు. తిట్లయిపోయి కోపం చల్లారిన తరువాతకూడా అతను చెల్లెల్ని తిండి తిన మన లేదు. రెండోరోజు ఉదయం కుంజనాథుని అత్త

వెళ్ళిపోతుంటే కుసుమ ఆవిడకు నమస్కారం చేసి పాదధూళి తలమీద ధరించి నిల్చున్నా, ఆవిడ ఏమీ మాట్లాడ లేదు. అల్లుణ్ణిచూచి "నీఇల్లూ వాకిలీ నువ్వే చూసుకోవాలి. ఇక్కడ చెల్లెలిదగ్గిర గోళ్ళు గిల్లుకుంటూ కూర్చుంటే పని సాగదు". అన్నది. కుసుమ సమాధానం ఏ మిస్తుంది? నిశ్శబ్దంగా కూర్చుంది. నిజమే అన్న రెండుచోట్ల పనిపాటలు ఎలా చూచుకోడం?

రెండు నెలలు గడిచిపోయినవి. ఈఅవకాశం కుంజుసిఅత్త వృధా చెయ్యకుండా అతన్ని విరిచి మడిచి మరమ్మతుచేసి కొత్తమనిషిగా తయారు చేసింది. ఇక అత నెప్పుడు ఆయింటికి మొహం చూడడు. చూచినా తిన్నగా మాట్లాడడు. అన్న హఠాత్తుగా ఇలా ఎందుకు మారిపోయాడో కుసుమ ఆలోచించింది. ప్రపంచంలో కుంజుడువంటి అల్పబుద్ధులు, బోళా వాళ్ళు గడుసుతనం లేనివాళ్ళూ మాత్రం మారిపోతారని ఆమెకు తెలిసే వుంటే, బహుశా ఆమెకు ఇంత దుర్భరంగా దుఃఖం వచ్చేదికాదు. అన్నా చెల్లెలిమధ్య స్నేహామే కాకుండా తగాదాలుకూడా తగ్గిపోయినవి. పోట్లాటకు సాహసంతోపాటు కోర్కెకూడా మాయమయి పోయింది. ఒకరోజు ఏకాకినిగా ఉండడానికి భయపడిన కుసుమ ఎన్నో రోజులనుంచీ రాత్రిళ్ళు ఒంటరిగానే గడుపుతున్నది. దుఃఖంమితిమీరేసరికి ఆమెభయం పోయింది.

కుసుమ తను ఒకవేళ చనిపోతే అన్నయ్య కన్నీటి చుక్క వదలడని అనుకొనేది అప్పుడప్పుడూ అన్నగారి కల్మషాన్ని కన్ని

ళ్ళతో ప్రక్షాళన చెయ్యడానికి ఇంటితలుపులు మూసి రోజంతా తెరిచేది కాదు. ప్రాణాలు బరువైపోగానే ఆమె చరణుణ్ణి గురించి ఆలోచించేది. వాడుమాత్రం అప్పుడప్పుడు 'అమ్మా అమ్మా' అంటూ పరుగెత్తుకొంటూ వచ్చి వదిలిపెట్టకుండా కొన్నాళ్ళపాటు ఉండేవాడు. వాడిమూలాన అన్నిసందేహాలను నివృత్తి చేసుకొని కుసుమ బృందావనుకు జాబు రాసింది. అందులో ఉన్నసంకేతం బృందావన్‌వద్ద నిష్ఫలమయింది. చివరకు చీటీముక్క రాలేదు. వచ్చినవల్లా కొన్నిరూపాయలే! ఏమీ తోచక కుసుమ రూపాయలు తీసుకుని ఊరుకున్నది. నిన్నరాత్రి కుంజనాథుడు ఇంటికి వచ్చాడు. మళ్ళీ తెల్లవారక మునుపే తిరిగి వెడుతూంటే కుసుమ వచ్చి దగ్గిర నిలబడింది. ఈమధ్య పేచీలు, కబుర్లు మాని వేసినా నేడు మాత్రం ఆమె ఎందుకో "అన్నా! ఇంతపొద్దున్నే వెడతావా? వంట త్వరగానే చేస్తాను" అన్నది. కుంజుడు ముఖం తిప్పి "నేను అనుకొన్నట్టే అయింది బయలుదేరితే అపుచేశావు" అన్నాడు.

సహనానికి ఎంత అలవాటు పడ్డా, ఇలా అకారణంగా అన్న ముఖం తిప్పుకొనేటప్పటికి కుసుమ మనస్సు మండిపోయింది. ముఖభంగి మార్చక కఠోరంగా "భయపడ వద్దు అన్నయ్యా! నీప్రాణాని కేమీ మోసం లేదు!" అన్నది.

"నేను మనిషిని కానని మాట్లాడుతున్నావా?"

"కావు. కుక్క పిల్లి కావు. అవికూడా నీకంటె మంచిగా ఉంటాయి. ఇలా విశ్వాసఘాతకంగా ఉండవు" అంటూ గదిలోకి వెళ్ళి తలుపు ఫెడీమని వేసింది. కుంజుడు కొంతసేపు

మూఢునిలాగా నిలబడి నింపాదిగా వెళ్ళిపోయాడు. బైటి తలుపు తెరిచే వుంది.

గంటతర్వాత బృందావన్ లోపలికి వచ్చి చకితుడై పోయాడు. కుంజుడిగది తాళం వేసి వున్నది. కుసుమతలుపు మూసేసి ఉన్నది వంటింటితలుపు తీసి వున్నది. అతను లోపలికి వచ్చేటప్పటికే కుక్క ఏదో తినేది వదిలి కుయ్ కుయ్ మంటూ సిగ్గూ భయం ప్రకటిస్తూ త్వరగా బయటికి వెళ్ళిపోయింది. అన్నం ఉడికింది. కాని పొయ్యి చల్లారి పోయింది. చరణ్ నడిచి నౌకరువెంట వస్తున్నాడు. అందుకని కొంత వెనక్కుపడిపోయాడు. పదినిమిషాలతర్వాత వాడు అమ్మా! అమ్మా! అని గట్టిగా కేక లేస్తూ చుట్టుపక్కల వాళ్ళకు స్వాగమనాన్ని తెలియపరుస్తూ లోపలికి వచ్చాడు. పిల్లవాని కేక విని తలుపు తెరవగానే ఆమె అశ్రుపూరితదృష్టి బృందావనుపైన పడింది. కుసుమకు అతను వస్తాడనే ఆశ లేదు. ఒకఅడుగు వెనక్కు వేసి పైటకొంగుతో ముఖమండలాన్ని ఆచ్ఛాదితం చేసుకుని గదిలోంచి చాప తెచ్చి పరిచింది. ఇంతలో చరణుడు పరుగెత్తుకొంటూ వచ్చి ఆమెకాళ్ళకు పెనవేసుకొన్నాడు. కుసుమ వాణ్ణి వొడిలోకి తీసుకొని ముద్దెట్టుకొని మూలనున్న స్తంభాన్ని ఆనుకొని నిలబడింది. తల్లి ముఖంవైపు చూచి చరణుడు రోదనస్వరంతో "నాన్నగారూ! అమ్మ ఏడుస్తున్నది" అన్నాడు. బృందావనుకు ఈసంగతి తెలుసు. సంగతేమిటి? ఎందుకు కబురు చేశావు?"

"కుసుమ అప్పటివరకూ సంబాళించుకో లేదు. అందుకే

ఏమీ మాట్లాడలేక పోయింది. బృందావన్ తిరిగి అడిగినాడు. జాబులో అన్నయ్యను మీరు కలుసుకోండి అని రాసి ఉంది: అత నేడీ!"

"చనిపోయాడు!" అన్నది కుసుమ కోపంతో.

అరెరె... చనిపోయాడా? అతనిగంభీరస్వరంలో వున్న వ్యంగ్యభావం కుసుమను బాధించింది. ఆమె తనఅవస్థ మరిచి పోయి చప్పున అనేసింది. "చూడండి. హేళన చెయ్యవద్దు. నావాళ్ళు అసలే మండుతోంది! ఈసమయంలో ఇలాంటి దేమీ బాగుండదు. పిలిపించినందుకే మీ రీలా కసి తీర్చుకొంటారా?" అంటూనే ఏడ్చింది.

ఏడుపు విన్నాకూడా అతను చలించ లేదు. కొంచెంసేపు ఆగి నన్నెందుకు పిలిపిస్తి? అన్నాడు.

ఆమె కళ్ళు తుడుచుకుని మీరు రాకపోతే నే నెవరితో చెప్పు కోను? అదివరకు ఏదో పనిమీద ఇలా వెళుతూండేవారు దారి తప్పి ఇలా రావడం మానేశారు. అన్నది.

"పొరపా టేమీ లేదు. అసలు సంగతి ఏ మంటావు?"

"తొందర పడితే చెప్పడానికి వీ లవుతుందా?"

బృందావన్ నవ్వి శాంతభావంతో తొంద రేమీ లేదు. సదుద్దేశంతోనే తెలుసుకో వలె ననుకొంటున్నాను. ఎలా వీలు గావుంటే అలాగే చెప్పు అన్నాడు.

"ఒకమాట చాలాకాలంనుంచీ అడగా లని... నేను తల విరయబోసుకుని తోవలో వెళ్ళేవాళ్ళకు నాస్వరూపం చూపుతూ తిరుగు తూవుంటా ననేఅపవాదు ఎవరు పుట్టించారు?

ప్రశ్న విని అతను చకితుడై అన్నాడు "నేనే!" ఆంతర్యాత?

నేను మీరే నని అనడం లేదు. ఎన్నడూ కలలోకూడా అనుకోలేదు— అర్థోక్తిలో అందుకొని బృందావన్, ఆరోజున అన్నాను. ఆలోచించాను కూడా నిన్ను పీడించడానికి మీ ఇంటికి భోజనానికి వచ్చాము. నేను మర్యాదస్తుణ్ణి అయివుండి కూడా ఆరోజున చేయగలిగింది ఇవాళ చెయ్యలేనా? ఆతప్పుకే కదూ అమ్మను నువ్వు ప్రాయశ్చిత్తం చేసింది!

కుసుమ వ్యథతో సిగ్గుపడి నింపాదిగా "తప్పుచేశాను. అప్పుడు మిమ్మల్ని గుర్తించ లేదు" అన్నది.

"ఇప్పుడు గుర్తించావా?"

కుసుమ మాట్లాడ లేదు. అతనూ క్షణంసేపు మౌనంతో ఉన్నాడు.

"మంచిది. ఇప్పుడే కుక్క వంటింట్లోకి వెళ్ళి అంతా పాడు చేసి పోయింది." అని ఉద్వేగం, చాంచల్యం ప్రకటించకుండా అన్నది. "పోనీండి, నేను తినను. మొదటనే తెలిస్తే వంట ప్రయత్నమే చెయ్యకపోయేదాన్ని."

"ఇవాళ ఏకాదశా?"

కుసుమ తల వంచుకొని "నాకు తెలియదు. ఏకాదశి ఉండను" అన్నది.

"ఏం?"

కుసుమ జవాబివ్వలేదు. అతను సందిగ్ధంగా అన్నాడు. "ఇదివరకైనా ఉండేదానివి కదూ అకస్మాత్తుగా ఎందుకు మానేసావు?"

పదే పదే ఆఘాతాలవల్ల కుసుమ ధైర్యం సడలిపోయి కోపంతో అన్నది. "ఉండను." నా ఇష్టం! తనను సర్వనాశనం చేసుకోవాలని ఎవరూ కోరరు. అందువల్ల ఉండను. అన్నయ్య వ్యవహారం అసహ్యంగా వున్నా నిజం చెప్పేస్తున్నాను- మీ సంగతి చూస్తే......ఉరి పోసుకుని చనిపోదామని పిస్తున్నది."

బృందావన్ "వద్దు. అలా చెయ్యకు......నాకోసం అలా చెయ్యకు. అన్నవ్యవహారం ఎందుకు అసహ్యమై పోయింది?"

చాలా ఉత్తేజంగా కుసుమ ఉత్తరం ఇచ్చింది. "అది చాలా పెద్దగాథ. వినిపించే ధైర్యం నాదగ్గిర లేదు. అన్నయ్య ఇల్లు వాకిలీ వదిలేసి నాయోగక్షేమం కనుక్కోడం మానేశాడు. అత్తగారి అనుమతి లేకపోవడం మూలంగా అన్నవస్త్రాలుకూడా ఇవ్వడం మానివేశాడు. చరణ్ ఒకవేళ అమ్మ భారం నెత్తిని వేసుకోకపోతే, ఇప్పటికి చాలా కాలం ముందే ఎండి కృశించి చచ్చేదాన్ని... ఈ సమయంలో నేను—' ఇలా అంటూ ఆగి ఇంకా ఏ మయినా చెప్పడం మంచి దవునా కాదా అని ఆలోచించి మళ్ళీ అన్నది. "ఒక్క క్షణంకూడా యిక్కడ ఉండ లేను."

"అందుకేనా ఉండలేనిది?" అని బృంద నవ్వుతూ అన్నాడు. కుసుమ ఒక్కపర్యాయం కన్నెత్తి చూసి మళ్ళీ వాల్చింది. ఈ సమయంలో అతని హాస్యప్రశ్నలో వున్న తీక్ష్ణత ఆమె మనస్సుకు బాధ కలిగించింది. బృందావన్ "చరణ్ తన తల్లి భారాన్ని అవశ్యం వహిస్తాడు. కాని నీ వెక్కడ ఉండదల

చాను!" అన్నాడు. కుసుమ తల వంచి "నా కేమి తెలుసు వారికే తెలుసు." అన్నది.

"వా రెవరు? నేనా?"

"అవును." కుసుమ మౌనం ప్రకటించింది.

"అలా కాదు. నేను నీ మాటల్లో అర్థం తెలుసుకో లేదు. అమ్మ మాత్రం ఏమయినా చెయ్య గలుగుతుంది. ఆమెతో నీ విది వరకు ఎలా ప్రవర్తించినా సరే, చరణ్ చెయ్యి పట్టుకుని ఆమెదగ్గరకు వెడితే ఏదో ఉపాయం చేస్తుంది. కాని మీ అన్నయ్య?"

కుసుమ కళ్ళవెంట కన్నీళ్ళు జల జల రాలినవి. కళ్ళు తుడుచుకొంటూ "నేను చెప్ప లేదూ?

అన్న చని పోయా డని. కాని నేను బిచ్చగత్తెలా ఎండలో కాలినడకతో మీ వూ రెలా రావాలో చెప్పండి!" అన్నది.

"నాకు తెలియదు. కాని వెళ్ళగలిగితే బాగుంటుంది." అన్నాడు బృంద.

కొంతసేపు కుసుమ ఆగి "నేను వెళ్ళను." అన్నది.

"నీ ఇష్టం" ఇందులో గూఢత్వం అస్పష్టతా లేవు. అందు కని కుసుమ చాలా భయ పడి పోయింది. త లెత్తి ఇంకా బృందావన్ ఏ మయినా అంటా డేమోనని ప్రతీక్షించి వేదనా భరంతో వినమ్రతతో అన్నది. "అయినా నే నిక్కడ నిలవ డానికి ఏమీ స్థానం లేదు. అన్నయ్యమీదకూడా నేరారోపణ చెయ్యలేను. న న్నిలా మీరు వదిలేస్తారా?" అన్నది. "చాలా ఆలస్య మయింది. చరణ్, ను వ్విక్కడ నుంటావా? వస్తావా?

నువ్వు చరణ్ చెయ్యి పట్టుకొని వచ్చి అమ్మ ఎదురుగా నిల్చుంటే నీకు పెద్ద అవమానం కలగ దనుకొంటాను" అని బృందావన్ రెండడుగులు వేయగానే చరణ్ణి దింపి కుసుమ నిలబడింది.

"ఇవాళ నాకు తెలిసింది యావత్తూ. నేను నిరాశ్రయ నని తెలిసికూడా ఆశ్రయ మివ్వ దలచనప్పుడు మీతో చెప్పుకొనేది కాని ఆశించేది కాని ఏమీ లేదు. అయినా నే నోమాట అడుగుతాను. తగిన సమాధాన మిస్తారా?"

బృందావన్ విస్మితుడై "ఓ అలాగే...... నే నెప్పుడూ ఆశ్రయ మివ్వడానికి నిరాకరించ లేదు. పైగా నువ్వే పదే పదే ఆ అవకాశాన్ని పోగొట్టుకొన్నావు." అన్నాడు.

దృఢస్వరంతో కుసుమ అన్నది. "అబద్ధం! ఆ సమయంలో నా దురదృష్టంవల్ల నా కేమయిందో తెలియదు. కాని నేను అమ్మ మనస్సుకు బాధ కలిగించి తప్పు చేశాను. ఆ దుఃఖం చచ్చినా పోదని నా అంతర్యామికి తెలుసు. ఇందుకే అందరూ వుండికూడా నేను అనాధవలె అయినాను. ఇప్పటి వరకూ అత్త వారింటి ముఖ మైనా చూచి ఎరగను. నా తప్పు ఎంత పెద్దదయినా యింటి కోడలిని. బిచ్చగత్తెలా ఎండలో అందరి ముందూ నడిచి అక్కడికి రావా లని మీ రెల్లా అన్నారు? మీ కింకో తోవ కనపడలేదా? ఎందుకు కనపడలేదో తెలుసునా? మేము నిరుపేదలం. మా అమ్మ తిరిపె మెత్తి మమ్మల్ని పెంచింది. తర్వాత మా అన్న నీచవృత్తి చేసి కాలంగడుపుతూ ఉండేవాడు. అందుకే బిచ్చపుదాని కూతురు బిచ్చగత్తెలా నడిచి నెడితే తప్పేమి టని మీా రనుకొన్నారు. ఇందులో

మీ తప్పే కాకుండా భరించలేని గర్వంకూడా ఉంది. నే నిక్కడ వుండి చావనైనా చస్తా గాని మీ ఎదట చెయ్యి చాపి, మీరు వేళాకోళాలు చేసి నవ్వుతోంటే రబ్బరుబొమ్మలా ఆడలేను!''

బృందావన్ ఆశ్చర్యంతో విని "వెళ్తాను. ఇప్పుడు నేను చెప్పవలసింది లేదు.'' అన్నాడు... "వెళ్ళండి. కొంచెం వుండండి. ఇంకోమాట వుంది. దయవుంచి అబద్ధా లాడకండి. నా సంబంధంలో మీ కేమయినా సందేహం ఉత్పన్నమయిందా? చెప్పండి. ఒకవేళ మీ ఎదట నిలువబడి ప్రమాణం... .."

నడిచే వాడల్లా ఆగిపోయి చకితుడై, మధ్యనే ఆపుచేసి "ఏమి టిది? వ్యర్థంగా ప్రమాణం ఎందుకు?'' అని ఆమె అర్ధవికసిత వదదాన్ని చూచి మృదువుగా, దృఢభావంతో అన్నాడు. అది గాక "నీ ప్రవర్తన విషయంలో ఎన్నడూ అనుమానించ లేదు. నేను అందరినీ మంచి వాళ్ళను కొంటాను. నిన్ను మరో విధంగా తలచను'' ఇలా అంటూ బృందావన్ నెమ్మదిగా బైటికి వెళ్ళిపోయాడు. కుసుమ వజ్రాఘాతం తిన్నదానిలా నిస్తబ్ధురాలై పోయింది.

చరణ్ అడిగాడు "రాత్రి స్నానం చెయ్యడానికి రానా?''

కుసుమ జవా బివ్వ లేదు. ఆమె అతన్ని నెమ్మదిగా గదిలోకి తీసుకు వెళ్ళి మంచంమీద పడుకుని గట్టిగా పిల్లవాణ్ణి దగ్గరికి తీసుకొని ఏడవసాగింది.

[౯]

చాలా రోజులు గడిచిపోయినవి. మాఘం వెళ్ళి ఫాల్గుణం కూడా వచ్చింది. చరణ్ తిరిగి రాలేదు. వాణ్ణి బలవంతం గానే రానీ లేదని స్పష్టమయింది. వారు మరే విధమయిన సంబంధమూ పెట్టుకోవడం మంచిగా తలచ లేదు. వారి దగ్గర నుంచి క్షేమ సమాచారాలు రాకపోవడంవల్ల ఆమెకూడా జాబు వ్రాసి అవమానం పొంద దలచలేదు. అన్నగారిలో మార్పు ఏమీ రాలేదు. అన్నివిధాలా కుసుమ ప్రాణం సంకటంలో పడ్డది. ఈ మధ్య ఆమె బయటికి రావడం, స్నేహితురాళ్ళతో కలిసి మెలిసి తిరగడం కూడా మానేసింది. కొంచెం చీకటి ఉండగానే నదికి వెళ్ళి నీళ్ళు తెచ్చుకొనేది. సంతరోజున గోపాలుడి తల్లిద్వారా కావలసిన వస్తువులు తెప్పించుకొనేది. ఇలా బాహ్య ప్రపంచంతో సంబంధం తెంచుకోవడం వల్ల ఆమె దుఃఖం ఎంతో హెచ్చింది. కుసుమకు కుట్టుపని బాగా తెలుసు. ఎవరయినా ఏమయినా ఇస్తే చాలా సంతోషంతో తీసుకొనేది.

ఇవాళ ఆమె వరాండాలో చాపమీద కూర్చుని ఏదో కుడుతుండగా సూది ఆగిపోయింది. ఆరోజు ఘటన స్మృతిపథంలోకి తెచ్చుకొని దానితో ఆడుకోడం మొదలు పెట్టింది. తొలిసారి భర్తతో అన్నమాటలు జ్ఞాపకం రాసాగినవి. దుఃఖం సహించ లేనప్పుడు పనులన్నీ మానేసేది. ఆసమయంలో ఆమె దుఃఖం కడిగివేసినట్లయ్యేది. రోజులు గడిచినకొద్దీ చరణ్ రాడేమో నని భయం వేయసాగింది. వాడు నిజంగానే

రావడం మానేస్తే తా నెలా బతుకుతుంది? పూర్వం ఆమెకు కలిగే సందేహం ఈ దుఃఖంలో కరిగిపోయింది. ఇప్పు డామెకు తనమీద విశ్వాసం అధిక మైంది. తనమీద ఆపాదించిన కళంకా లన్నీ మిథ్యగా భావించేది. బాల్యావస్థనాటి కళంక చరిత్ర అంతా అసత్యం...... ఆమె హిందూకన్య. ఏ పాపం ఆమెను చేరదు. తెలిసీ తెలియకా కూడా హిందూకన్య పర పురుషుణ్ణి ప్రేమించ లేదు. పరులకు శుశ్రూష చేయడానికి ఆమె హృదయం ఇంత ఉన్మత్తం కాదు. ఒకవేళ అతను తన భర్త కాకపోతే భగవంతుడు తన హృదయంలో ఒక్క మూల నైనా సిగ్గు ఉంచేవాడు. ఇవాళ సంత. గోపాలుడితల్లి సంతకు వెళ్ళింది. తిరిగి వొచ్చే వేళ అయింది. అందుకని గృహ ద్వారం తెరిచే వుంది. ఇంతలో బాబూ కుంజనాథ్ వెంట నౌకరును తీసుకొని విదేశీజోళ్ళ టకటకతో, చుట్టు పక్కల వాళ్ళ మనస్సులో ఈర్ష్యాధూళి లేపుతూ ఇంట్లోకి వచ్చాడు. కుసుమ గుర్తించి సిగ్గుతో ముఖమెత్తి చూడలేక పోయింది. కుంజనాథుడు తిన్నగా చెల్లెలి కెదురుగా నిల్చుని "మీ బృందావన్ తిరిగీ వివాహం చేసుకోంటున్నాడు." అన్నాడు. ఆమె గుండె లాగిపోయిన ట్లయింది. కర్ర బొమ్మలా ఉండి పోయింది కుసుమ.

కుంజుడు బిగ్గరగా అన్నాడు. "మొసలితో పగ పెట్టుకొని నీళ్ళల్లో ఎన్నాళ్ళుంటాడో చూస్తాను. నందవైష్ణవుని తాత దిగి రావాలి. మన చోట వుంటూనే మనను అవమాన

పరచడానికి! —— ——" కుసుమకు మాట లేమీ తెలియ లేదు. ఆమె చాలా కష్టంతో "వా డెవరు?" అని అడిగింది.

"మా రైతు మా చెరువుగట్టున ఇల్లు కట్టుకున్నాడు. వాడింటికిని ప్వంటిస్తాను. ఆగాడిద బిడ్డనే— ఈ ఫాల్గుణంలోనే పెళ్ళి. అంతా కుదిరింది —— —— భూతా, —— కొంచెం పొగాకు నింప రా."

కుసుమ ఇంతవరకూ త లెత్త లేదు. అందుకే నౌకరు వచ్చా డని ఆమెకు తెలియదు.

కుంజుడు "ఏమిరా భూతా! నందునిబిడ్డ ఎలా వుంటుందిరా?" అని అడిగాడు. భూతా బాగా ఆలోచించి "చక్కగానే వుంటుంది." అన్నాడు. కుంజుడు కోపంతో "చక్కందా? బొత్తిగా కాదు. మా చెల్లిలా వుంటుందా? ఛశ్! నువ్వెప్పుడయినా ఇలాంటి అందం చూశావా? అన్నాడు. భూత జవాబు ఇవ్వకముందే కుసుమ లేచి లోపలికి వెళ్ళింది. కొంతసే పాగి కుంజుడు పొగ తాగుతూనే గది ముందు నిలవబడి "ఏం కుసుమా! నేను మొదటనే అన లేదూ? బృందావన్ అస లైన విశ్వాస ఘాతకు డని? నామాట ఏ మయిందో చూడు. అత్తగారన్నది, వేదం అబద్ధం కావచ్చు గాని నా కుంజుడిమాట అబద్ధం కా దని. ఏమిరా భూతా, అమ్మగా రలా అంటుంది కాదూ?"

గదిలోనుంచి జవాబు ఏమీ రా లేదు. కాని అస్పష్టమయిన శబ్దం మాత్రం వస్తూంది. ఏదో ఆలోచించి కుంజుడు హుక్కా అక్కడే పెట్టి గదిలోకి వెళ్ళి నిలుచున్నాడు. కుసుమ శయ్యమీద

బోర్లగిల పడుకుని ఉన్నది. కుంజనాథుడు కొంతసేపటివరకూ ఆమెవైపు చూస్తు ఉండిపోయాడు. చాలారోజులు తరువాత ఈనాటికి అతనికళ్ళమ్మట రెండుసీటిచుక్కలు రాలినై. చేత్తో తుడుచుకొని మంచంమీద కూర్చుని చెల్లెలితలపైన చెయ్యి పెట్టి మెల్లిగాఅన్నాడు. "కుసుమా, భయపడ బోకు, నే నీ వివాహం కానివ్వను. నీవే చూస్తావు అన్న మాట నిలుపు కొంటాడో లేడో, అయినా చెల్లీ, నీవుకూడా అత్తారింటికి వెళ్ళడానికి ఒప్పుకోలేదు. మామాట వినలేదు."

చివరమాట అంటూండగానే కుంజకంఠం గద్గద మయింది. కుసుమ భరించ లేక వెక్కి వెక్కి ఏడవసాగింది. అన్నహృద యంలో తనమీద ప్రేమలేశ మయినా ఉన్న దని అనుకో లేదు. కుంజుడికళ్ళవెంట జలజల నీళ్ళు రాలినై. నిశ్శబ్దంగా తల నిమురుతూ చెల్లెలికి ధైర్యం ఇస్తూ కూర్చున్నాడు.

సంధ్యాసమయం అయింది. ఇంకొక్కసారి కుంజుడు చక్కగా తనకోటుచివరతో కన్నీళ్ళు తుడుచుకొని "చెల్లీ, నేను చెప్పి వెడుతున్నాను, ఈవివాహం ఎలానూ కానివ్వను." అన్నాడు.

కుసుమ ఏడుస్తూ అన్నది "ఒద్దన్నయ్యా! నువ్విందులో ఏమీ కల్పించుకోకు" అన్నది.

కుంజుడు ఆశ్చర్యంతో "నేను కల్పించుకోవద్దా? మా కళ్ళెదు రుగా పెళ్ళి అవుతూంటే మేము చేతులు కట్టుకుని తమాషా చూడాలా?" అన్నాడు.

కుసుమ "ఒద్దు" అన్నది.

"తప్పక చెయ్యి చేసుకొంటాను. నీ కవమానం కలక్క

పోవచ్చు, కాని నాకు తప్పదు. నేను దీన్ని సహించలేను. వాడు మారైతు. నువ్వేమంటున్నావు? ఎవరయినా వింటే ఛూ అనరూ?" కుసుమ దిండులో తల దాచుకుని మధ్యమధ్య తల ఊపుతూ అన్నది. "పోనీ అన్నయ్యా! మనకూ వారికీ సంబంధం లేదు. నలుగురిలో పెట్టి కళంకం ఎక్కువ చెయ్యవద్దు. పెళ్ళయితే కానీ."

ఊహుఁ అన్నాడు కుంజుడు.

"ఎందుకు వద్దు? నన్ను వదిలి వారో పెళ్ళి చేసుకున్నారు కదూ? కావాలంటే ఇంకోటి చేసుకొంటారు. మనకు రెండూ ఒకటే. నీకాళ్ళమీద పడతాను. వృథాగా పోట్లాడి నాపరువు తియ్యకు. వారు సుఖంగా వుంటే చాలన్నా!"

కుంజుడు మొదట హుఁ అని తరవాత "నిన్ను నేను మొదణ్ణించీ ఎరుగుదును. ఒక్కపర్యాయం నువ్వు కాదన్నావంటే అవు నని పించడానికి ఎవరితరం కాదు కాని నీమాటమాత్రం అంతా వినాలి. అది కాక వారిమాటల్లో తప్పేమి? ఇల్లు ఆడుది లేకుండా ఎన్నాళ్ళు జరుగుతుంది? నువ్వు వెళ్ళవు గదా. ఇప్పుడంటే తల్లి వున్నది. ఆవిడ ఎన్నాళ్ళుంటుంది?"

కుసుమ ఏమీ జవాబివ్వలేదు. కుంజు "చేసుకున్నా చేసుకోకపోయినా మంచిదే అంటూ ఏడుస్తావేం?" అన్నాడు.

ఈ ప్రశ్నలకు ప్రత్యుత్తరం కుసుమ ఇవ్వగలదా? చీకట్లో కుసుమ కన్నీళ్ళు తగ్గడం కుంజుడు చూడలేదు కాని ఈప్రశ్న తర్వాత వాటివేగం హెచ్చింది. అన్న వెళ్ళిపోయాక ఆనాటి మాటలు తలుచుకొని కుసుమ తనలో తానే సిగ్గు పడింది.

ఛీఛీ ఈసిగ్గు పోయేమార్గం లేదు. నే నెంత పొగడినాకూడా ఇందుకనే వారికి ఆశ్రియం ఇవ్వడానికి వీలు లేకపోయింది. అటు కొత్తపెళ్ళికి సన్నాహా లవుతున్నప్పుడు నే నభిమానంతో వారింటికొడలి నని చెప్పుకొన్నాను. ప్రేమలేశమైనా లేనిచోట పర్వతపరిమాణంగల అభిమానం చూపాను. భగవంతుడా ! ఈ దుఃఖభారం గలశిరస్సుమీద ఎంత లజ్జాభారాన్ని వేసి సంతోష పడుతున్నావు. ఆమె హృదయాన్ని ఛేదించుకుని ఉచ్ఛ్వాసం బయటపడింది, ఓ ఇందుకనే వారికి నాస్వభావం తెలుసుకోడానికి కుతూహలం లేదు. అప్పటికీ నేను సిగ్గు లేకుండా శపథం చేయబోయాను.

[౧౦]

కొందరు మనుష్యులు ఎలాంటి అవస్థల్లోనైనా దురాగ్రహం చెందరు. బృందావన్ ఆతరగతివాడు. మంచివాళ్ళు ఎప్పుడూ కూడా ప్రతిపక్షితో తగాదా పడి నలుగురునోళ్ళల్లో పడడానికి అంగీకరించరు. అయినప్పటికీ ఆనాడు కుసుమ పదేపదే మోపిన అన్యాయాలకు క్రుద్ధుడై నిరర్థకంగా కొన్ని కటువైనమాట లని వచ్చాడు. దానివల్ల అతను పొందిన మనస్తాపానికి హద్దు లేకపోయింది. అందుచేతనే రెండోరోజు ఉదయమే చరణుణ్ణి తీసుకు వచ్చేనెపంతో ఒకనౌకరునూ బండినీ పంపి తెలివి తేట లున్నకుసుమ ఈమర్మం తెలుసుకొని తనఇంటికి వస్తుం దని ఆశించాడు. ఒకవేళ వస్తే ఏం చేయడం అనేమీమాంస బయలు దేరింది. తల్లి ఇంట్లోనే ఉన్నది; ఆవిడే అన్నిపనులూ చక్క

బెడుతుం దని తెల్సుకొన్నాడు. తల్లికార్యకౌశలంమీద అతనికి అత్యధికవిశ్వాసం ఉన్నది. ఏఅవస్థలోకూడా ఉపాయంగా అందరికీ శుభదాయకమైనపనే చేస్తుం దని అతని నమ్మకం.

ఆకారణంవల్ల తల్లిని అడగకుండానే బండిపంపించి ఆశా ఆనందాలతో మిళిత మైనలజ్జాభయాలతో ఎదురు చూస్తు న్నాడు. "కనీసం అమ్మను క్షమాపణ వేడుకోడానికయినా కుసుమ ఇవాళ తప్పక వస్తుంది." అనుకొంటే రెండుఝాము లప్పుడు చరణుణ్ణి ఎక్కించుకొని బండి తిరిగి వచ్చింది... ..

చండీమండపంలోనుంచి చూసి బృందావన్ స్తబ్ధు డైపోయాడు. కొన్నిరోజులబట్టీ బడికూడా తిన్నగా నడవడం లేదు. చాలామంది విద్యార్థులు రావడం మానేశారు. వచ్చినవాళ్ళు పలకలు కడగడంలోనే పొద్దుబుచ్చుతున్నారు. దేవుడిప్రసాదం నిజంగా దొరుకుతుంది. కృత్రిమభక్తివల్ల ఆవేళ కందరూ సిద్ధం.

బృందావన్ అకస్మాత్తుగా పాఠశాలవైపు ధ్యాస పెట్టడం ఆరంభించాడు. పలక కడగడాని కయ్యేఆరుగంటలు. పదిహేను నిమిషాలలోకి తగ్గిపోయినవి.

పదిరోజు లయ్యాక మూడుజాము లప్పుడు ఎక్కాలు చెప్ప డానికి బృందావన్ పిల్లలను పంక్తిగా నిలవ బెట్టాడు. పిల్లలు బిగ్గరగా అరుస్తూ గణితవిద్యాప్రావీణ్యం ప్రకటిస్తున్నారు. ఇంతలో ఒకపెద్దమనిషి అక్కడికి వచ్చాడు. బృందావన్ వెంటనే లేచి వారిని కూర్చో బెట్టి వారివైపు చూస్తూ ఉండి పోయాడు. ఆగంతుకుడు వయస్సులో బృందావన్‌తోటి వాడే.

ఆయన కూర్చుని నవ్వుతూ అన్నారు "నన్ను గుర్తు పట్టలేదా?" అన్నాడు. బృందావన్ సిగ్గుపడి "లేదు" అన్నాడు.

"నేను వచ్చినపని తర్వాత చెప్తాను. మామగారు జాబులో మిమ్మల్ని చాలా ప్రశంసించారు. విదేశానికి వెళ్ళడానికి ముందు ఒకపర్యాయం మీదర్శనం చేసి పోదా మని వచ్చాను. నాపేరు కేశవ్."

బృందావన్ ఒక్క-గంతులో బాల్యసఖుణ్ణి కౌగలించుకొన్నాడు. అతను పూర్వం ఇంగ్లీషు అధ్యాపకుడైనదుర్గాదాసబాబుకు మేనల్లుడు. ఆరోజుల్లో ఇద్దరికీ చాలా స్నేహం ఉండేది. దుర్గాదాస్ భార్య చనిపోగానే కేశవ్ వెళ్ళిపోయాడు. అప్పటికి మళ్ళీ కలుసుకో లేదు. ఐనా పరస్పరం మరచిపో లేదు. బృందావనుకు తరుచుగా మాష్టరుగారిద్వారా బాల్యమిత్రుని క్షేమం తెలుస్తూ ఉండేది. అయిదేళ్ళకు కేశవ్ యం ఏ. అయి కళాశాలలో ప్రొఫెసర్ అయినాడు. గవర్నమెంటుపనివల్ల విదేశం వెళ్ళవలసి వచ్చింది. కుశల ప్రశ్న లయ్యాక కేశవ్ అన్నాడు: "అబద్ధా లాడడం అలా వుంచి మామగారు ఎప్పుడూ అత్యుక్తి కూడా చెప్పరు. వారు మునుపటిజాబులో ఇలా వ్రాశారు: ఇప్పటి కెందరికో చదువు చెప్పాను. అయినా బృందావన్ తప్ప తక్కినవా ళ్ళెవరైనా మనుష్యు లయినారో లేదో నాకు తెలియదు అని—ఇప్పటివరకూ యదార్థమైనమనిషి నెవ్వరినీ చూడ లేదు. విదేశం వెళ్ళడానికి పూర్వం ఒకపర్యాయం నిన్ను చూసిపోదా మని వచ్చాను."

ఈవాక్యాలు మిత్రునినోటివెంట వచ్చినప్పటికీ, సిగ్గువల్ల

దాని కీయవలసిన జవాబు వెతికినా బృందావనుకు కనపడలేదు. అతను స్వప్నంలోకూడా ప్రపంచంలో ఏమానవుడూ ఇంత అధికంగా తనను స్తుతిస్తాడని అనుకోలేదు. విశేషించి ఈస్తుతి వాక్యం గురువుద్వారా ప్రచారం కావడంవల్ల అతని మనసు మందగించింది. కేశవుడు దీన్ని తెలుసుకొని అన్నాడు: "మంచిది, బృందా, నీకు సిగ్గు తెప్పించేమాట అనను. కేవలం మామగారి అభిప్రాయం నీకు చెప్పాను. ఇక పనికొచ్చేది మాట్లాడుదాం. నువ్వు బరి తెరిచావు. ఫీజు తీసుకోకపోవడమే కాకుండా పిల్లలకు పుస్తకాలూ బట్టలూ కొని ఇస్తున్నావని విన్నాను ఇలానే చెయ్యాలని నేనూ అనుకొన్నా గాని శిష్యుల్ని చేర్చ లేక పోయాను. ఇంతమంది కుర్రాళ్ళను ఎలా పోగుచేశావు?"

బృందావన్‌కు అతనిమాటలు తెలియలేదు; కాబట్టి విస్మితుడై పోయాడు. కేశవుడు నవ్వుతూ అన్నాడు: "మంచిది. నే నింకా వివరించి చెప్తాను, లేకపోతే నీకు తెలియదు. సామాన్యమైనపిల్ల లందరికీ చదువు సంధ్యలు చెప్పడంవల్ల దేశానికి మనం సేవ చేస్తున్నా మన్నమాట. పెద్దలు ఇలాగే చెపుతారు. చదువు చెప్పకుండా ఎన్ని పనులు చేసినా వ్యర్థమే. చదువుకొంటే కీడూ మేలూ తెలుసుకొంటారు. ఆవిరి వుంటేనే ఇంజన్ నడుస్తుంది. అన్నీ నీకు తెలుసు. లేకపోతే ఇంటిసొమ్ము పెట్టి పాఠశాల తెరువవు. నే నందుకే పెళ్ళికూడా చేసుకోలేదు. ఇక్కడిలాగ పాఠశాల తెరవడానికి తగినచోటు దొరకలేదు. మొదట చిన్నబడి పెట్టి దాన్నే స్కూలు చేయాలని కుతూహలం ఉండేది. పిల్లవాళ్ళు చేరలేదు. ఇక కిందికులాలవాళ్ళు

దెయ్యాలవంటివాళ్ళు. పిల్లల్ని బడికి పంప మంటే పంపరు భాయీ, నువ్వు నీచకులాలవాళ్ళ ఇళ్ళచుట్టూ తిరగడం ఉచితంగా లేదు.”

బృందావన్ నవ్వి “నువ్వు మమ్మల్ని అనలే దని తెలుసు. మాఆత్మీయస్వజనాన్ని అన్నావు. మే మంతా సాలి, కమ్మర, గొల్ల, రైతులం. నాగళ్ళు చేస్తాం, బట్టలు నేస్తాం, పశువులు కాస్తాం, పంటలు పండిస్తాం. తెల్లబట్టలు కట్టం. గవర్నమెంటు ఆఫీసుల తలుపులదగ్గిరికి కాలికి బలపం కట్టుకుని తిరగం. అందుకే నువ్వు మమ్మల్ని తక్కువకులాలవాళ్ళన్నావు. మంచిపనిమీద మాఇళ్ళకు వచ్చినమాత్రాన మీమానమర్యాదలు నష్టమయిపోతాయి.” కేశవ్ తల వంచి “భాయీ, బృందా! నేను నేను నిజం చెబుతున్నాను. నిన్ను రైతుగా గొల్లగా కాకుండా వేరేవాడిని గాతలిచి అన్నాను.” అని పలికినాడు.

“నువ్వు వేరుగా భావించినమాత్రాన వే రవను. నేనూ రైతునే. స్వయంగా నేల దున్నుతాను. వాళ్ళలో వుండే నేను పెరిగి పెద్దవాణ్ణయ్యాను. అందుకనే నిస్సంకోచంగా వారు నాదగ్గిరికి వచ్చారు. మీదగ్గిరికి రావడానికి వాళ్ళకు సాహసం లేదు. మేము చదువురాని దరిద్రులం. మాఅభిమానం మేము తెలియ జెయ్యలేము. మమ్మల్ని మీరు తక్కువకులాలవాళ్ళని అంటే మేము దానికి తల వూపుతాం; కాని మాఅంతరాత్మ అంగీకరించదు. అది మీతియ్యనిమాటల్ని లెక్క చెయ్యదు.”

కేశవుడు తల వాల్చి సిగ్గుతో వినడం మొదలు పెట్టినాడు.

“ఈపనివల్ల మా కేమీ లాభం లే దని తెలుసు. అయినా

మిమ్మల్ని ఆత్మీయుల్నిగా తలచడం మాకు భయం వేస్తుంది. మాలో గమ్మత్తు వైద్యులకూ పిచ్చిపండితులకే ప్రతిష్ఠ దొరుకుతుం దని మీకు తెలియదు. నేను అలాగే పేరు సంపాయించాను. పండిత్ జీ అని మీవంటి డాక్టర్లూ, ప్రొఫెసర్లూ ఇక్కడ దేనికీ పనికి రారు. మాహృదయాల్లో మాఅంతరాత్మలో భగవంతుడు ఉన్నాడు. పైన కూర్చుని కిందివాళ్ళకు భిక్ష వెయ్యడం అతని కిష్టం లేదు. అతడు మిమ్మల్ని తిరస్కరిస్తాడు."

కేశవుడు ప్రతివాదం చేశాడు: "మిమ్మల్ని తిరస్కారం చెయ్యడం తప్పు. వాస్తవంగా మిమ్మల్ని నీచంగా చూడం. నిజంగానే మీక్షేమం కోరుతూ ఉంటాము. మాపైన విశ్వాసం ఉంచడం మీకు మంచిది. విద్యాప్రభావంవల్ల మీకేపనిలో క్షేమం ఉన్నదో మాకు తెలుసు. అన్నింటిలో మేమే ఉన్నతి పొందా మని మీకు తెలుసు. ఈస్థితిలో మామాట వినడం మీకర్తవ్యం".

"భగవంతుడు మిమ్మల్ని ఎందుకు తిరస్కరిస్తాడో అతనికే తెలుసు. ఆత్మీయులవలె మాశ్రేయాన్ని కోరరు. యజమానుల్లా కోర్తారు. భాగ్యవంతుల పిల్లలకు లాభం కలగవలెననీ, మాకు పతనం కావా లనీ చూస్తారు. మీసంపర్కంలో వుండే రైతుపిల్లలు దొరగా తయారు కాగానే చదువు రాని తండ్రితాతలను లక్ష్యం చెయ్యరు. వారిమాట వినరు. చదువు నేర్చుకోవడంవల్ల అంతిమపరిణామాన్ని మేము మీలోనే చూస్తాం. తక్కువ కులాలవాళ్ళను ఆత్మీయులుగా చూడడం నేర్చుకోండి. వారిపిల్లలకు చదువు చెప్పండి. మీరు మా

రైతుల్ని హీనంగా చూడకండి. ఇలా చెయ్యకపోతే వెయ్యి జన్మాలు బ్రహ్మచారిగా వున్నా మీబడికి తక్కువకులాల పిల్లలు రారు. మిమ్మల్ని చూసి పిల్లలు గౌరవిస్తారు, భయపడతారు, భక్తిచూపుతారు. కాని విశ్వసించరు. మీమాట వినరు. మీశ్రేయం వారిశ్రేయం ఒకటే నని వారెప్పుడూ నమ్మలేరు.''

కొంచెం సేపు ఆలోచించి కేశవుడు అన్నాడు. ''బృందావన్! నీమాటే సరి అయిందని తోస్తుంది ... ఒకరిపైన ఒకరికి విశ్వాసం లేనప్పుడు ఆత్మీయతను ప్రకటించీ లాభం ఉంటుందంటావా? ... నమ్మకం లేకపోతే మేము ఆత్మీయులం అవునో కామో ఎలా తెలియచేయడం?''

''మొదటే చెప్పాను. మాఆచారాలను మీరు కుసంస్కారాలని నిర్ధారణ చేస్తూంటే, మాఆరోగ్యోపాయులు మీకు భిన్నంగా వుంటే, మిమ్మల్ని ఎలా విశ్వసించడం? సరే కేశవ్! ఉపనయనం అయినప్పణ్ణించీ సంధ్యావందనం చేస్తున్నావా?''

''లేదు.''

''బూట్లు తొడుక్కునే నీళ్ళు తాగుతావా?''

''తాగుతాను.''

''మ్లేచ్ఛుల చేతిభోజనం?''

''తప్పు లేదు. చేస్తాం.''

''అలా అయితే తక్కువకులాలమధ్య బడి పెట్టి వారిపిల్లలకు చదువు చెప్పాలనే సంకల్పం కపటం. అంతకంటె ఎక్కువని నేనంటే నీకు కోపం.''

"దురాగ్యం"

"ఔను కేశవ్. కోరికలు హృదయం ఉన్నంతమాత్రాన పరోపకారం చెయ్యడానికి వీలులేదు. నీవు ఎవరిని సంస్కరించాలని అనుకొంటున్నావో వారితోపాటు ఉండటంకూడా నేర్చుకోవాలి. చాలు సంజవేళ అయింది. కొంచెం ఒడిపని చూచుకుంటాను."

"అలాగే. రేపుఉదయం వచ్చి మీదర్శనం చేస్తాను" అంటూ కేశవుడు లేచి నిలబడగానే బృందావన్ ప్రణామం చేసి పాదధూళి తీసుకొని తలపైన పెట్టుకొన్నాడు. కేశవుడు బస్తీవాడు. తనమిత్రుడు చేసినయీపని చాలా బాధ కలిగించింది. ఇద్దరూ వరండాలోకి వచ్చేసరికి పిల్లలు శిరస్సులు వంచి నమస్కారాలు చేశారు. తనబాల్యమిత్రుణ్ణి గుమ్మందాకా సాగనంపి బృందావన్ "స్నేహితుడివైనా నీవు బ్రాహ్మణుడివి. నీకు నాపిల్లలు కూడా నమస్కారాలు చేస్తున్నారు. తెలిసిందా?" అన్నాడు.

సలజ్జహాసంతో కేశవ్ "తెలిసింది" అంటూ నింపాదిగా వెళ్ళిపోయాడు.

రెండోరోజు ఉదయం కేశవుడు వచ్చినాడు. "బృందా! నీవు వాస్తవంగా మనుష్యుడివనడంలో నాకు సుతరాం సందేహం లేదు.

"నాకూ లేదు స్వామి... ఇంకా..."

"నీకు నేను ఉపదేశం చెయ్యడం లేదు. నిన్నటితో నా అహంభావం నశించింది... నీవు ధనకాలాన్ని వ్యయం చేసి

పిల్లలకు సంధ్యలు చెబుతున్నావు. ఇంకా ఎన్నో గ్రామాల్లో క, ఖ, లు రానివాళ్ళు కోట్లానకోట్లున్నారు. ఈపని గవర్నమెంటువారు చేయవలసింది. కాదంటావా?"

"చిన్నపిల్లాడిలా అడిగావోయ్ కేశవా! మనకర్తవ్యాన్ని పాలించకుండా ఇతరులు ఏదో చేయలేదనడం పాపం."

కాని నీసామర్థ్యం ఎంత? ఈచిన్నబడి పెట్టినంతమాత్రాన ఏమంత ప్రాయశ్చిత్తమవుతుంది?"

"కాదు భాయీ. నీమాట సరిగా లేదు. మాబళ్లో చదివినవాళ్ళల్లో ఒక్కడు మనుష్యుడుగా తయారయినా దేశాన్ని ఉద్ధరిస్తాడు. న్యూటన్, ఫారెడే, రామమోహన్, విద్యాసాగరులు కుప్పతిప్పలుగా ఉండరు. నేను చనిపోకముందే నాబళ్లో ఒక్కడయినా బయలుదేరాలని నన్నాశీర్వదించు. నాపాఠశాలలో షరతు ఉంది. నిన్న బళ్లో వదిలేశేవేళకుంటే నీకు తెలిసేది. ప్రతికుర్రవాడూ తాను పెద్దవాడయ్యాక అవశ్యం ఒకరిద్దరికయినా చదువు చెబుతానని ప్రతిజ్ఞ తీసుకోవాలి. నేను లెక్క వేసినట్టు ఇరవైఏళ్ళలో మనదేశంలో ఒక్క నిరక్షరకుక్షి మిగలడు."

కేశవుడు గాఢనిశ్వాసంతో "ఎంత పెద్ద ఆశ!" అన్నాడు.

"నిజమే! దుర్బలముహూర్తంలో నాకు అప్పుడప్పుడు భయం వేస్తుంది. భగవంతుని దయారసవృష్టి వుంటే ఇదేమంత పెద్ద ఆశ?"

"బృందావన్! నే నీరాత్రి బయలుదేరి విదేశం వెడుతున్నాను. మళ్ళీ మనం ఎప్పుడు ఒకరొకర్ని చూసుకొంటామో

ఈశ్వరుడికే తెలియదు. నేను ఉత్తరం రాస్తే జాబు రాస్తావా''? అన్నాడు.

"ఇ దేమంత పెద్దపని కేశవ్''?

"పెద్దపని కూడా చెబుతున్నాను. మిత్రుణ్ణి జ్ఞాపకం ఉంచుకొంటావు కాదూ''?

"అయ్యో, తప్పకుండానూ'' అంటూ బృంద కేశవుని పాదధూళి తీసుకొన్నాడు

[ ౧౧ ]

బృందావన్ తల్లి దేవుడి 'డోలోత్సవం' చాలా అట్టహాసంతో చేస్తుంది. అది నిన్ననే సమాప్తి అయింది. చాలా అలసిపోవడంవల్ల బృందావన్ పొద్దెక్కినా లేవలేదు. తల్లి గదిబైటనుంచే పిలిచింది. "బృందా! లేచి బయటికి రా నాయనా!'' అని తల్లి విచారంతో పిలవడం విని అతను తొందరగా లేచి కూర్చుని "ఏ మయిం దమ్మా?'' అన్నాడు. తల్లి లోపలికి వచ్చి "నేను గుర్తించలేక పోయాను. నీబడిపిల్లవాడొకడు బయటకూర్చుని ఏడుస్తూన్నాడు. వాడితండ్రి వాంతులు విరేచనాలవల్ల లేవలేకుండా ఉన్నాడు'' అని చెప్పింది.

బృందావన్ త్వరగా బైటికి వచ్చాడు. అతన్ని చూడగానే గొల్లసుబ్బు కొడుకు ఏడుస్తూ "పండితజీ! నాన్న కళ్ళయినా తెరవడం లేదు, నోట మాట లేదు'' అన్నాడు.

బృందావన్ వాత్సల్యంతో వాడికన్నీళ్ళు తుడిచి వాడితో కూడా వాడింటికి వెళ్ళాడు. సుబ్బుకు చివరఘడియ సమీపిం

చింది. ప్రతియేడూ ఈరోజుల్లోనే కలరా వ్యాపిస్తుంది. ఈ పర్యాయం మొదట సుబ్బుకే తగిలింది. రాత్రినుంచీ ఏచికిత్స లేకుండానే వాడు నిలిచి ఉన్నాడు బృందావన్ వచ్చిన గంటకు వాడిప్రాణం పోయింది.

వంగదేశంలో గ్రామాల్లో కొంచెం చదువుసంధ్యలున్న వాళ్ళు ఒకరిద్దరు వైద్యులుగా తయారవుతారు. ఈవూళ్ళో కూడా అలాంటి డాక్టరొకడు, గోపాల్. అతన్ని నిన్నరాత్రి పిలవగానే కలరా పేరు విని రెండురూపాయలు ఫీజు అడిగాడు. గొప్పఅనుభవంవల్ల ఇలాంటివ్యాధిగ్రస్తుల దగ్గర వెంటనే ఫీజు తీసుకోకపోతే దీన్ని తీరవడాని కయినా వాళ్ళు బ్రతక రని అతనికి తెలుసు. సుబ్బుభార్య అర్ధరాత్రివేళ రూపాయలు సంపాయించలేక పోయింది. ఏవో ఉప్పునీళ్ళు తాగించి అంతిమ చికిత్స నెరవేర్చి రాత్రంతా పక్కన కూర్చుని అమ్మవారిని ప్రార్థించడం మొదలెట్టింది. ఆతర్వాత ఉదయం ఇలా జరిగింది

భర్తఅంత్యక్రియలకు బృందావన్ కాళ్ళు పట్టుకుని విధవ ఏడవసాగింది. సుబ్బు సంపత్తులో ఉన్న దల్లా అర్ధాన్నంవల్ల ఎండిపోయిన రెండుచేతులూ. రెండుఆవులూ రెండిటిలో ఒక దాన్ని తాకట్టు పెట్టి ఈకష్టాల్నించి ఒడ్డెక్కాలి. ఏమీ కుదవ బెట్టుకోకుండానే ఇలాటి అనేకకర్మలు బృందావన్ తనజీవితంలో చేయించాడు.

సుబ్బుదహానం అయినతర్వాత రెండుజాములకు అత నింటికి తిరిగి వచ్చాడు. సంధ్యవేళ అయింది. చండీమండపంలో చాప పరుచుకుని బృందావన్ పరున్నాడు. ఇంతలో ఎవరో రావడం

వల్ల కళ్ళు తెరిచాడు. వచ్చినవాడు సుబ్బుకొడుకే; బృందావన్ లేచి కూర్చుని "వచ్చి కూర్చో రాముడూ" అన్నాడు. పిల్ల వాడు రెండుమూడుసార్లు పెదవు లాడించి తరవాత పండితజీ! అని ఏడ్చినాడు. బృందావన్ ఆకుర్రవాణ్ణి తనదగ్గరికి తీసుకున్నాడు. వాడు ఏడుస్తూ "కృష్ణకుకూడా తగిలింది" అన్నాడు. కృష్ణుడు వాడి తమ్ముడు. వాడుకూడా అప్పు డప్పుడు అన్న వెంట చదువుకోడానికి వస్తూండేవాడు. ఇవాళరాత్రి డాక్టర్ గోపాల్ అడ్వాన్సు తీసుకోకుండానే బృందావన్ వెంట కృష్ణుణ్ణి చూడ్డానికి వెళ్లాడు! నాడి చూచాడు. నాలుక చూశాడు. అయినా వాడికి తనతల్లి విచారం వైపుగాని, చికిత్సకుని మర్యాదవైపుగాని ధ్యాస ఏమి లేదు. తెల్లవారేసరికల్లా వాడు డాక్టర్ గోపాల్ ప్రసిద్ధ హస్తాలకు చెడుపేరు తెచ్చి తనతండ్రి దగ్గిరికి వెళ్ళిపోయాడు. పుత్రునిశవాన్ని వొళ్ళో తీసుకుని ఏడుస్తోన్న వితంతువును చూసి బృందావన్ హృదయం పగిలి పోయింది. స్వయంగా అతనికి కూడా కొడుకున్నాడు. అతను ఉండబట్టలేక ఇంటికి పరుగెత్తుకొని వెళ్ళి చరణ్‌ను గట్టిగా కౌగలించుకుని ఏడవసాగినాడు. అతను అంతరాత్మలోకి దృష్టి మరల్చి వెయ్యిసార్లు మనస్సులోనే ప్రార్థించాడు. "హేభగవన్! మనుష్యునితప్పులకు ఇంకేదయినా శిక్షవెయ్యి. కాని దీన్నిమాత్రం వెయ్యకు" అని. జగదీశ్వరుడు అతనిప్రార్థన విన్నాడో లేదో తెలియదు. ఇవాళ ఇంతబాధ భరించడానికి శక్తి తనలోమాత్రం లేదని అతను నిశ్చయించుకొన్నాడు. రెండురోజులు నిర్విఘ్నంగా గడిచిపోయినవి. కాని

మూడోరోజే అతనిఇంటిపక్క నున్నరసికునిభార్య ఇప్పుడో ఇంకాసేపటికో అంటూన్నదని తెలిసింది. బృందావన్ తల్లి చూడడానికి వెళ్ళింది. పదిగంటలకు ఆమె కన్నీరు తుడుచుకొంటూ ఇంటికి వచ్చింది. మరోగంటకు ఏడుపులనుబట్టి రసికుని భార్య తనఅయిదారుగురు పసికందల్ని వదిలిపెట్టి పోయిందని తెలిసింది. గ్రామంలో కలరా తీవ్రంగా వ్యాపించింది. పోదలుచుకున్న వాళ్ళు పారిపోయారు. ఎక్కువమంది పోలేక భయపడుతూనే సాహసంతో "అన్నం అయిపోయింతర్వాత ఎలాగయినా వెళ్ళాలి. పారిపోగానే ఏమవుతుంది?" అన్నారు.

బృందావన్ ఇంటిముందే పెద్దతోవ. అటు హరినామం తరుచు వినబడుతూ ఉండడంవల్ల నిరంతరం ఎవరో ఒకరు చస్తున్నారని అతనికి తెలిసింది చుట్టుపక్కల గ్రామాల్లో కూడా ముగ్గురూ నల్గురూ పోతున్నట్టు తెలుస్తున్నది కాని బాడల గ్రామపరిస్థితిమాత్రం భీషణంగా వుంది. ఇక్కడ తాగే నీటికి సరియైనఏర్పాటు లేదు. ఏరు లేదు. మొదట్లో వున్న రెండుచెరువులు మరమ్మతు లేక పాడయ్యినై. ఆనీరు తాగడానికి పనికి రావు. అయినా వాటిగతి ఆలోచించేవారు లేరు. నీళ్ళతో దప్పిక చల్లార్చడానికి, అన్నం ఉడికించడానికీ శక్తి ఉన్నంతవరకూ దానిమంచీ చెడూ గురించి ఆలోచించే ఆవశ్యకత చాలామంది పెద్దమనుషులకు కనపడలేదు. ఇటు డాక్టర్ గోపాల్ తప్ప మరోవైద్యుడే లేడు. వారికి బీదవాళ్ళదగ్గిరికి వెళ్ళేసమయం దొరకడం లేదు. క్రమంగా ఔషధాలమాట అలా వుంచి ఊళ్ళోవాళ్ళకు శవాల్ని దహనం చెయ్యడమే

కష్ట మయిపోయింది. అయినా బృందావన్ వీధిలో ఇంతవరకూ ఏఆపదా లేదు. రసిక్ భార్యకు తప్ప ఇం కెవరికీ తగ ల్లేదు.

బృందావన్ తండ్రి తవ్వించిన చెరువునీరు మాత్రం ఇంత వరకూ చెడిపోలేదు. బహుశా దానివల్లనే ఈవీధివాళ్ళకు రోగం తగ ల్లేదేమో. బృందావన్ రోజురోజుకూ చింతతో ఎండిపోతున్నాడు. కుర్రివాడి వైపు చూడగానే అతనిగుండెలు అదిరిపోయేవి. ఏదో ఆపద రాబోతుం దని అతనికి అనుక్షణం భయం వేసేది. అతనిలో వున్నసాహసం పోయి చావుపేరు చెప్పగానే వణికిపోయే వాడు. ఎవరన్నా పిలి స్తే తప్పక వెళ్ళే వాడు. కాని అతనికి అడుగుమాత్రం న్యాయాలయానికె వెళ్ళే అపరాధివలె వుండేది. కేవలం అభ్యాసంవలెనే వెళ్ళేవాడు. శవదహానం చేసి వచ్చి చరణ్ణి దగ్గిరికి తీసుకుని వణికిపోయే వాడు. తనఏకపుత్రునిలో అంటురోగబీజాలు నాటుతున్నా యని అతనిభయం. వాణ్ణి ఎలా రక్షించడ మని అతనిఆదుర్దా. పాఠశాల దానంతట అదే ఆగిపోయింది. అతను చరణుకు తిని పించడం తాగించడం మొద లైనవన్నీ స్వయంగానే చేస్తు న్నాడు. ఈవిషయంలో అతనికి తల్లిమీదకూడా విశ్వాసం లేకపోవచ్చు. ఈరోజుల్లోనే తారిణీముఖోపాధ్యాయుని చిన్న కొడుకుకూ తగిలిం దని తల్లిద్వారా విన్నాడు. ఇది వినగానే బృంధావన్ముఖం నల్లబడ్డది. ఇలా అవడం చూచి తల్లి "ఇంక చాలు నాయనా. చరణ్‌ను తీసుకుని నువ్వెక్కడి కయినా వెళ్ళిపో" అన్నది. బృందావన్ కళ్ళు అశ్రుపూరితా

లయినాయి. అమ్మా, నువ్వుకూడా రా. అన్నాడు. తల్లి ఆశ్చర్యంతో మన దేవుణ్ణివదిలా రావడం? అన్నది.

"దేవుడిపూజ పురోహితుడికి అప్పగించెయ్యి".

తల్లి ఇంకా ఆశ్చర్యంతో "మన దేవుణ్ణి ఇంకొకరికి అప్పచెప్పి నేను పారిపోయిరానా?" అని అడిగింది.

బృందావన్ సిగ్గుతో "కాదమ్మా, రెండురోజులవరకే" అన్నాడు. తల్లి తల వూపుతూ "అలా అనకు, మీనాయనమ్మ ఈ భారం నామీద వేసిపోయింది. ఇంకెవరికన్నా ఇవ్వగలిగితే నేనూ ఇచ్చే వెళుదును. కాని నామీదనే వుండిపోయింది. అయినా మీరు వెళ్ళండి" అన్నది. బృందావన్ విషాదంతో అన్నాడు: "నిన్నిలాంటిసమయంలో వదిలిపెట్టి పోనా? ఒక వేళ .." తల్లి కొంచెం నవ్వి "నాయనా, అలా జరిగితే చాలా మంచిది. దేవుడు నాకు సెలవిచ్చాడనుకొంటాను. నాయనా, మీకు నాఆశీర్వాదం నిర్భయంగా వెళ్ళిపోండి. నేను హాయిగా దేవుడితోపాటు వుండిపోతాను" అని చెప్పింది. తల్లినిశ్చితాభిప్రాయాన్ని వినగానే పోదామని కలిగిన అతని ఆశ అదృశ్యమయింది.

కొంచెంసేపు ఆలోచించి అతనన్నాడు. "అలా అయితే నేనుకూడా వెళ్ళను. నీకు దేవు డుంటే నాకు తల్లి ఉన్నది. నాకు నావిషయంలో ఏభయం లేదు. చరణుడికోసమే నాఆలోచన. వెళ్ళడానికి వీలు లేనప్పుడు దేవుడిమీద భారం వేసే వుంటాను. నేను విచారంతో వుండడం నీ వెప్పుడూ చూడలేవు".

తారిణి చిన్నకొడుకు చనిపోయాడు. రెండోరోజు ఉదయం

బృందావన్ ఏదోపనిమీద వెళుతూ తనచెరువుదగ్గర ఎవరో స్త్రీ బట్టలు ఉతకడం చూచాడు. ఆబట్టలవైపు చూడగానే అతను వొణికిపోయాడు. దగ్గరికి వొచ్చి కోపంతో "మీరు శవంబట్టలు ఎందుకు ఉతుకుతున్నారు"? అన్నాడు. ముసుగు లోంచి ఏ మన్నదో వినపడలేదు· "అయిన అనర్థ మేమో అయింది. ఇంక ఉతకడం మానేసి వెళ్ళిపోండి". అనేశాడు. ఆమె బట్టలు తీసుకుని వెళ్ళిపోయింది· బృందావన్ స్తబ్ధుడై నీళ్ళవైపు చూస్తూ నిల్చుని తర్వాత కొంతదూరం నడిచాక, తారణి త్వరత్వరగా ఇటువైపు వస్తూన్నాడు· అతని కిదివరకే పుత్రశోకం ఉన్నది. పైగా ఇప్పుడో అవమానం. రాగానే పిచ్చివాడిముఖం పెట్టి గుడ్లెర్ర జేసి "నువ్వు నా భార్యను చెర్లో స్నానం చెయ్య నీలేదు"? అన్నాడు.

"అది కాదు. మురికిబట్టలు ఉతక నీలేదు".

తారణి అరుస్తో "ఆమె ఇంకెక్కడ ఉతుక్కుంటుంది? ఉండడం ఈవూళ్ళో, ఉతకడం ఇంకోవూళ్ళోనా? బృందావన్! నాశన మవుతావ్! నాశనం! తక్కువవాడి వైపుండి డబ్బుమదంతో బ్రాహ్మణ్ణి కష్టపెడితే నీవంశం నిర్మూల మవుతుంది" అన్నాడు. బృందావనుకు కడుపు మండిపోయింది. అయినా వ్యర్థంగా పోట్లాడ్డం అతనిస్వభావం కాదు. కోపాన్ని ఆపి నెమ్మదిగా "నే నొక్కణ్ణే పోతే ఫర్వాలేదు. కాని మీరు వీధులో వా ళ్ళందర్ని చంపేఉపాయం ఆలోచిస్తునారు. ఊ రంతా తగులడుతున్నది. ఈవీధిమాత్రం మిగిలింది. దీన్ని కూడా ఉండనివ్వరా మీరు?" అన్నాడు.

"ఆదినుంచీ అంతా నీచెరువులో పుతక్క-పోతే నీతలమీంద ఉతుకు తున్నరా?"

బృందావన్ దృఢంగా జవా బిచ్చాడు: "ఈ చెరువు నాది. నామాట వినకపోతే మీఇంటివారిని ఎవర్నీ ఈచెరువులో అడుగు పెట్టనియ్యను".

"దిగనీకపోతే మేము ఎక్కడికి పోవాలి?"

"ఇక్కణ్ణించి తాగడానికి నీళ్ళు తీసుకుపోండి. బట్టలు ఊరి చివర చెర్లో ఉతుక్కోవచ్చు."

తారిణిముఖం మార్చి "ఇంతచిన్నవాడికి ఇంతనోమా? ఆడ వాళ్ళు ఊరిబయటకు వెళ్ళి బట్టలు ఉతుక్కోవాలా! అంతా మానెత్తిమీదికే రాలేదు" అన్నాడు.

"నేను ఆడవాళ్ళను ఊరిబయటకు వెళ్ళమనడం లేదు. ఇంట్లో దాసీలు నౌకర్లూ లేకపోతే మీరు మొగాళ్ళేకద? వెళ్ళి ఉతుక్కు రండి. మీ రిప్పుడు అసలే దీనావస్థలో వున్నారు. అందుకని మిమ్మల్ని ఏమీ అనలేను. మీరు లక్షశాపాలు పెట్టినా చెరువునీళ్ళు పాడుచెయ్య నియ్యను." ఇలా అంటూ బృందావన్ తర్కవితర్కాలు లేకుండా ఇంటికి వెళ్ళిపోయాడు.

పదినిమిషా లయ్యాక ఘోషాలు మహాశయుడు ఇంటిముం దుకు వచ్చి పిలిచాడు. అతను తారిణీబంధువు. బృందావన్ బైటికి రాగానే అన్నాడు.

"బృందావన్! అంతా నిన్ను మంచిపిల్లవా డంటారు. ఇ దేంవ్యవహారం? బ్రాహ్మణు పుత్రశోకంతో చస్తూ వుంటే నీవు పైగా చెరువుదగ్గిరికే రా వద్దంటావా?"

"మురికిబట్టలు మాత్రం ఉతక వద్దన్నాను."

"నీవు మంచిపని చెయ్యలేదు. పోనీ, వాడు నీమాట మనస్సులో పెట్టుకుంటాడు. ఇక దూరంగానే ఉతుక్కుంటాడు."

"గ్రామం అంతటికీ ఇది ఒక్కటే మంచినీళ్ళ చెరువు. దీన్ని చెడగొట్ట నియ్యను."

విజ్ఞఘోషాలు మహాశయుడు క్రుద్ధుడై అన్నాడు: "బృందావన్! ఈ కక్ష బాగా లేదు. ఏ పుష్కరిణిని శాస్త్రానుసారం ప్రతిష్ఠ చేశావో దానినీవు ఏవిధంగానూ అపవిత్రం కలుషితం కాదు. నాలుగు ఇంగ్లీషుముక్కలు వెలగబెట్టగానే నీకు శాస్త్రాలు పనికిరాక పోయాయా. ఇలా అయితే ఎలా?"

బృందావన్ ఒకేమాటను పదేపదే చెప్పలేక విసిగిపోయాడు "నాకు శాస్త్రాలమీద విశ్వాసమే. అయినా మీ మనోముద్రిత శాస్త్రాలు నేను ఒప్పుకోను. నేను అన్నట్టే చేస్తాను. ఇంకేవరన్నా అయితే శవంబట్టలు తగలెట్టేవాళ్ళు. మీకా బట్టల మీద వ్యామోహం వుంటేబైటగుంటలో ఉతుక్కోండి" అంటూ బృంద లోపలికి వెళ్ళిపోయాడు. శాస్త్రజ్ఞాని ఘోషాల్ మహాశయుడుకూడా బృందావను సర్వనాశనం కావాలని తిట్టిపోయాడు. ఈవ్యవహారం ఇంతటితోనే ఆగిపోయేది కాదని అతనికి తెలుసు. అందుకే చెరువుదగ్గర మనిషిని కాపలా వుంచాడు. రాత్రి తొమ్మిది గంటలకు చెరువులో బట్టలు ఉతుకుతున్నారనీ, తారిణి ఎంత చెప్పినా వెళ్ళడం లేదనీ తెలిసింది. బృందావన్ వెళ్ళి చూచేసరికి, తారిణివిధవపిల్ల తలగడా గలీబులు, దుప్పట్లు, చిన్న

పెద్దాపేలికలు చెరువులోనే ఉతికి పిండుతున్నది. తారిణి స్వయంగా అక్కడ నిలుచున్నాడు.

[ ౧౨ ]

రెండోరోజు బృందావన్ తల్లిఆజ్ఞానుసారం చరణుని దగ్గిరికి పిలిచి "ఏమిరా, మీఅమ్మదగ్గిరికి వెడతావా"? అన్నాడు. చరణ్ సంతోషంతో "ఓ వెడతాను" అన్నాడు. బృందావన్ మనస్సు దెబ్బ తిన్నట్టయి "కాని నువ్వక్కడ చాలా రోజు లుండాలి. మమ్మల్ని వొదిలి వుండగలుగుతావా?" అంటే "ఓ" అన్నాడు కుర్రవాడు తల ఊపి.

ఈమధ్య ఏర్పడ్డ కఠిననియమాలకు పిల్లవాడు తాళలేకుండా ఉన్నాడు. బడి మూసి వున్నది. ఆటపాటలు లేవు. స్నేహితు లెవరూ కనపడరు. దాదాపు రోజంతా వాణ్ణి ఇంట్లోనే ఉంచే వారు. నాలుగువైపులా ఒకవిధమైన చీకటి కమ్ముకొన్నది. సంగతి ఏమిటో తెలుసుకో లేకపోయినా, లోలోపల వ్యాకుల పడేవాడు. అటు అమ్మమీద ఆపేక్ష, నీళ్ళోసుకోవడం మంచి మిఠాయీలు వీట్లని చూసే కాకుండా అక్కడ అతన్ని ఏపని చెయ్యవద్దని నిరాకరించేవాళ్ళు లేరు. కనుక అక్కడికి ఎప్పుడు వెడతానా అని తహతహ లాడుతున్నాడు. బృందావన్ వెళ్ళమన్నాడు. కుర్రవాడు తనచేతిలో ట్రంకుపెట్టి, దాని నిండా బట్టలు, కొన్ని రూపాయలు పెట్టి, బండిలో ఉంచాడు. కన్నీరు నింపుతూ చరణుణ్ణి ముద్దెట్టుకొని బృంద కుర్రాణ్ణి తల్లి దగ్గిరికి పంపేశాడు. వాడివెంట వెళ్ళిన నౌకరును పిల్లవాణ్ణి

జాగ్రత్తగా చూడమని రెండురోజుల కోసారి కబురు చెప్ప మనీ, గట్టిగా చెప్పాడు.

పిల్లవాణ్ణి చూడలేకపోయినా బృందావన్ ఈవిపత్తునుంచి కాపాడగలిగా నని సంతోషించాడు. బండి కనబడేంతవరకూ చూచి ఇంట్లోకి వచ్చి ఆలోచనలో పడ్డాడు. కుసుమ వొప్పుకోదేమో నని. "నేను చేసింది సరియైంది కాదు. పెంకిమనిషితో పని. నేను వెంట వెళ్ళకపోతే ఏదో చేస్తుంది" అనుకొంటూ వెంటనే ఉత్తరీయం బుజాన వేసుకొని బండి అందుకొన్నాడు. కుంజుడిఇల్లు చేరగానే అక్కడిస్థితి చూసి బృందావన్ చకితుడైనాడు. నాలుగువైపులా పెంటపోగులు, తెరిచినతలుపులు, శూన్యగృహంలా వుంది. పిల్లవాణ్ణి తీసుకుని లోపలికి వెళ్ళి చూచాడు. అక్కడా ఇలాగే వుంది చప్పుడు వింటూ కుసుమ ఇంట్లోనుంచి అన్నయ్యా అంటూ బయటికి వచ్చింది. కాని వీరిని చూచి ఈర్ష్యాభిమానాలతో మండిపోయి గదిలోకి వెళ్ళింది. చరణ్ ఎప్పటిలాగే చాలా సంతోషంతో వెళ్ళి కుసుమను కౌగలించుకొన్నాడు. ఆమె వాణ్ణి వొళ్ళోకి తీసుకుని మేలిముసుగు సర్దుకొని గుమ్మందగ్గిరికి వొచ్చి నిలవబడింది.

బృందావన్ "అన్నగా రెక్కడున్నారు?" అన్నాడు.

"తెలియదు. ఎక్కడికో తిరగడానికి వెళ్ళారు."

"ఇన్నాళ్ళబట్టీ ఇంట్లో లేరా?"

"ఊహూ," అన్నది కుసుమ.

"ఎక్కడున్నాడు?"

నెల్లాళ్ళకిందట కుసుమ అన్నఅత్తగారివెంట పశ్చిమతీర్థ

యాత్రిలకు వెళ్ళింది. నిన్ననే తిరిగి వచ్చింది. అలా అని చెప్ప కుండా అక్కడా ఇక్కడా చాలా చోట్ల ఉన్నాను అని చెప్పింది.

పూర్వం బృందావన్ రాగానే కుసుమ చాప తెచ్చి పరి చేది. ఇవాళ అలాంటి దేమీ చెయ్య లేదు. బృందావను స్వయంగా నిల్చుని వున్నా ననీ కూర్చోడానికి చోటు చూప మనీ అడిగాడు కుసుమ లెక్క చెయ్యకుండా చాపలూ గీపలూ ఎక్క డున్నాయో తెలియదు అంటూ నిలబడిన చోటే ఉండిపోయింది. బృందావన్ సిద్ధపడే వచ్చాడు. అయినా ఇంత నిర్లక్ష్యం చేస్తుం దని అతను అనుకోలేదు. ముందూ వెనుకా చూచి సమ్రతతో "నేను ఆట్టేసేపు బాధపెట్టను. వచ్చినపని చెప్పేస్తాను. మావూళ్ళో కలరా ఎక్కువగా వుంది. అందుకే చరణ్ణి నీదగ్గిర వొదిలి వెడతాను" అన్నాడు.

కుసుమకు ఈమధ్యన జరిగినసంగతులు తెలియవు. తీవ్రాభి మానంతో ఆమె "ఓ అందుకా ఇలా దయచేశారు! రోగాలు ఎక్కడ లేవని పరాయిపిల్లవాణ్ణి కాపాడేసాహసం ఎలా—?" అన్నది. బృంద శాంతంగా నే నెలా చేశానో అలానే. అంతే కాకుండా వాడికి అందరికంటె నీమీదనే ఎక్కువ ఇష్ట మని. నాకు తెలుసు. అన్నాడు. కుసుమ ఏదో అనవలె నని అను కొంటూ ఉండగానే చరణ్ అమెపెదవుల్ని తననోటితో అడ్డి "అమ్మా, నాన్నగారు నీదగ్గరే వుండమంటున్నారు. నీళ్ళోసుకో వద్దూ?" అన్నాడు. ఇందుకు ప్రత్యుత్తరంగా కుసుమ బృందా వనుడు వినేట్టు "వొద్దు. నాదగ్గి రెందుకూ? ఇంకోఅమ్మ వచ్చాక అమెదగ్గిర వుందువు గాని" అన్నది. బృందావన్

క్షీణంగా నవ్వుతూ అన్నాడు. "అదికూడా తెలిసిందా? అయితే నేను చెబుతా విను. అమ్మ వొంటరిగా ఇల్లు చక్క బెట్టుకో లేకుండా వుంది. అందుకని ఆమాట వచ్చింది. కాని వెంటనే ఆగిపోయింది." అన్నాడు.

"ఏం? ఎందు కాగిపోయింది?"

"దాని కో కారణం వుంది- అయినా అ వన్నీ ఇప్పు డెందుకు? రా నాన్నా, చరణ్ వెడదాం రా! ఆలస్యం అవు తోంది."

చరణ్ ముద్దుగా "నాన్నా రేపు వస్తాను" అన్నాడు బృంద ఏమీ మాట్లాడ లేదు. కుసుమకూడా ఏమీ అనకుం డానే వాణ్ణి వొళ్ళోనుంచి దింపేసింది. రెండు నిమిషా లయ్యాక బృంద చాలగంభీరంగా పిలిచాడు. "ఆలస్యం చెయ్యకు రా. రా ఇలా" అంటూ నెమ్మదిగా వెళ్ళిపోయాడు. చరణుడు గారాల బిడ్డ అయినా పెద్దవాళ్ళు చెప్పినట్టు వింటాడు. ఒక్క సారి అమ్మకేసి చూసి తర్వాత నెమ్మది నెమ్మదిగా తండ్రితో వెళ్ళిపోయాడు.

బండివాడు ఎద్దులకు నీళ్ళు పట్టడానికి వెళ్ళాడు. తండ్రి కొడుకులు వాడికోసం ఎదురు చూస్తున్నారు. ఇప్పుడు కుసుమ నెమ్మదిగా వీధివాకిలిదగ్గిరికి వచ్చి భర్తముఖం చూడగానే ఆశ్చర్య పడ్డది. ఇప్పు డతనిలో అందం లేదు. కళ్ళు లోతుకు పీక్కుపోయినవి. ముఖం వివర్ణమయింది. వెంటనే ఆమె ఆగ లేక "ఓమాట విని వెడుదురు గాని" అని అరిచింది. బృంద దగ్గిరికి వచ్చి "ఏమిటి?" అన్నాడు.

"ఈమధ్య ఖాయిలా పడ్డారా!"

"లేదు".

"మరి ఇలా కనిపిస్తున్నా రేం!"

"కారణం చెప్పలేను. బహుశా విచారంవల్ల ఇలాకని పిస్తున్నా నేమో!"

"విచారం!" భర్తముఖం చూడగానే ఆమెవేడి తగ్గిపోయింది. కాని తుదిమాట విని మళ్ళీ కోపం వచ్చింది ఆమె శ్లేషగా " మీాకు సుఖానికి ఏంలోటు! ఎందుకు విచారం చెప్పండి. వినా లని వుంది" అని అడిగింది.

బృంద సమాధానం ఇయ్యలేదు. చరణ్ బం డెక్కాడు. బృందావన్ అన్నాడు. "ఏం రా, అమ్మకు నమస్కారం బెట్టి వచ్చావా!" అని, చరణ్ బండి దిగి కుసుమకు దగ్గిరిగా నేలకు తల ఆనించి ప్రణామం చేశాడు ఆమె చేతులు చాపి దగ్గిరికి తీసుకోవలె ననుకొనేసరికి, పరుగుతో వెళ్ళిపోయాడు. మాట లన్నీ తెలియక పోయినా అమ్మతనను ఆదరించలే దని తెలుసు కొని ఉంటాడు. బృందావన్ ఇంకా దగ్గిరికి వచ్చి గద్గదికతో "ఇంకా ఎప్పు డయినా చెప్పగలుగుతానో లేనో. ఇవాళే చెప్పి వెడతాను, నీవు ఇవాళ కోపంతో చరణుడికి చోటివ్వలేదు. నేను లేనప్పు డయినా తప్పకుండా ఇవ్వాలి" అన్నాడు. కుసుమ వినిపించుకోకుండా "నా కీమాటలు వినా లని లేదు" అన్నది.

"అయినా విను. నే నివాళ వీణ్ణి నీకు అప్పచెప్పడానికి వచ్చాను."

" మీాకు నామీాద నమ్మక మేమిటి!"

బృందావనుకు కళ్ళవెంట నీళ్లు తిరిగినవి.

"మళ్ళీ అదే కోపం! కుసుమా, బాగా నేర్చుకున్నావు. కాని స్త్రీలకు అవసర మయింది క్షమ అది నేర్చుకో లేదేం? నాకు మాత్రం నీవు చరణ్ తల్లి వన్న విశ్వాసం ఉన్నది! పిల్ల వాణ్ణి తల్లికి అప్ప చెప్పకపోతే ఇం కెవరికి అప్పచెప్పడం?

ఎంత వెతికినా కుసుమకు సమాధానం దొరక లేదు. ఎద్దులు ఇంటికి పోవా లని తొందర పెడుతున్నాయి చరణ్ "నాన్నా రా రా" అని పిలిచినాడు. కుసుమ ఏదో చెప్పా లనుకొంటున్నది. అంతకముందే బృందావన్ వస్తాను అంటూ బండెక్కాడు.

కుసుమ అక్కడే కూర్చుండి పోయింది. పరలోకవాసిని అయిన తల్లిని ఉద్దేశించి "తల్లివై ఉండి నా కెంత శత్రు వైనావు! నాకు జ్ఞానం లేనప్పుడు నువ్వు నిజంగా ఏ మయినా కళంకంలో మునిగి వుంటే, నీసీచపాదాలమీద నన్ను బలి ఇచ్చేసి వుంటే, నా కెందుకు విప్పి చెప్పకుండా వెళ్ళిపోయావు? ఏభయంతో అన్నిగుర్తులూ చెరిపివేశావు? నాఅంతర్యామి చూపుతున్నభర్తనూ కొడుకునూ, లోకం ఎదురుగా సేవించ డానికి ఎందుకు మార్గం వదిలి పెట్టలేదు? అలా అయితే న న్నెందుకు త్యజిస్తారు? సిగ్గు లేనిఏపురుషుడు తనభార్యను అనాధ లాగా ఇంటికి రమ్మని ఉపదేశించడానికి సాహసిస్తాడు? నేను నిజంగా విధవ నైతే ఇన్నిసందేహాలు ఎందుకు? ఆదశలో విధవావివాహం చేసుకో మని కోరడానికి ఎవరికి ధైర్యం వుంటుందీ?" మనసులో అనుకొన్నది.

కుసుమ కూర్చుని చాలాసేపు ఏడ్చింది. తరువాత ఆకాశాన్ని చూసి చేతులు జోడించి ప్రార్థించింది. "భగవాన్, నా కేదయినా దారి చూపించు! త లెత్తుకుని భర్తదగ్గిరికి వెళ్ళేట్టుగా చెయ్యి. లేకపోతే విచారాలు దుశ్చింతలూ లేని బాల్యావస్థను మళ్ళీ ప్రసాదించు, సుఖంగా ఊపిరి తీసుకోడానికి."

[ ౧౩ ]

భర్త రెండో పెళ్ళి చేసుకొంటా డని అన్న ద్వారా విన్నప్పుడు కుసుమకు ఎక్కడికి వెళ్ళాలో, ఏం చేయాలో తెలియ లేదు. ఇంతలోనే కుంజఅత్తగారు తీర్థయాత్రలకు వెడుతున్నది. ఆమె కుసుమను దాసీగా వినియోగించుకొన్నది. అయినా ఆమె ఇందుకు విచారపడ లేదు. తిరిగి నలడాంగా వచ్చాక కుసుమ ఇంటికి రావడానికి ప్రయాణ మవుతోంటే కుంజనాథ్ అత్త పాములాగ బుసకొడుతూ "పిచ్చిపిల్లల్లా చెయ్యకు. మనం పెద్దవాళ్ళం అడు గడుక్కా గిట్టనివాళ్ళూ- ను వ్వేమో వయసులో వున్నావు. అక్కడ వొంటరిగా వుంటే మాకు తలవొంపులుగా వుంటుంది!" అన్నది. కుసుమ ఏమీ జవాబు ఇవ్వ లేదు.

"వెళ్ళదల్చుకుంటే అన్నగారివెంట వెళ్ళి తిరిగి వస్తూండు. నే చెబుతున్నాను. ను వ్వక్కడ వొంటరిగా వుండ లేవు."

కుసుమ ఈమాటకే రాజీపడి ఒకసారి ఇల్లూ వాకిలీ చూచి పోదా మని నిస్న వచ్చింది. ఇవాళ చరణుడు వెళ్ళినతర్వాత సుమారు రెండుగంటలకు కుంజనాథ్ జమీన్ దారుఠీవితో ఊరేగి

వాచ్చాడు. స్నానం చేసి భోజనానంతరం విశ్రాంతి తీసుకుని అత్తవారింటికి వెళ్ళడానికి సన్నాహాలు చెయ్యడం మొదలు పెట్టాడు కుసుమ తలుపు లన్నీ వేసి బండి ఎక్కింది.

అన్నకు వాళ్ళంటే ఇంష్టం లేదు. కనుక కుసుమ పొద్దున జరిగినసంగతు లేవీ చెప్పలేదు. కుంజుని భార్యపేరు వ్రిజేశ్వరి. ఆమె తెల్లివైనదే కాకుండా కలహదక్షు. ఆమెకు పదిహేనేళ్ళు నిండక పోయినా మాటలతీరు, ఈర్ష్యాజ్వాలకూ తల్లిఅంతది కూడా ఓడిపోయి, కన్నీటిధారలు కార్చవలసివచ్చేది. ఈవ్రిజే శ్వరి కుసుమను చూచినదగ్గర్నుంచీ ఎలా పేృమించడం మొదలు పెట్టిందో • తెలియదు. తల్లికి కూతు రిలా చేయడంవల్ల సంతోషం కలగలేదు. కూతురు చూడకుండా తన యిష్టం వచ్చినమాటలు ఆమె అంటూనే వుంది. ఇంటిముందే చిన్న చెరు వున్నది. మూడునాలుగురోజు లయ్యాక ఒకనాటిఉదయం కొన్నిపాత్రిలుతోమి తీసుకురావడానికి కుసుమ వెడుతూన్నది. వ్రిజేశ్వరి ఇంట్లోంచి బైటికి వచ్చి చాలా కర్కశంగా అడిగింది "వొదినా! అమ్మ నిన్ను ఎన్నిరూపాయల జీతంమీద ఏర్పాటు చేసింది?" అని తల్లి దగ్గిరే సామాన్లగదిముందు కూర్చుని పని చేస్తున్నది. కూతురు వేసినశ్లేషాత్మకప్రిశ్న విని ఆశ్చర్యంతో గర్జిస్తూ "ఏం మాటలే అవి? మనవాళ్ళను ఎవరి నన్నా జీతా నికి కుదుర్చుకుంటూరా?" అన్నది.

"నాకూ బంధువే. నీ కావిడ ఏ మవుతుం దని జీతం ఇవ్వ కుండా చాకిరీ చేయించుకొంటున్నావు?"

దీనికి ప్రత్యుత్తరంగా తల్లి త్వరగా కుసుమచేతులో వున్న

అంట్లపాత్రను తీసుకుని స్వయంగా చెరువుదగ్గిరికి వెళ్ళింది. కుసుమ స్తబ్ధుగా ఉండిపోయింది. వ్రజేశ్వరి ఆమెను చూచి నవ్వుతూ గదిలోకి వెళ్ళి "పోనిస్తూ." అన్నది. దీనితర్వాత రెండు మూడురోజులు వ్రజతల్లి కుసుమను తనకోధాగ్నికి గురి చేసింది కాని అకస్మాత్తుగా ఒకరోజు ఆమెలో కలిగినమార్పు వల్ల వ్రజ చాలా ఆశ్చర్య పడ్డది.

నిన్నరాత్రి కుసుమవాంట్లో బాగాలే దని భోజనం మానేసింది. ఆవాళ ఇంటియజమానురాలు స్నానం పూజా చేసి భోం చెయ్య మని పదేపదే బతిమాలడం సాగించింది. వ్రజ దగ్గిరికి వెళ్లి మెల్లిగా "వొదినా! అమ్మ ఈఛద్మవేషం ఎందుకు మార్చుకుండా అని ఆలోచిస్తున్నా" అన్నది. కుసుమ ఏమీ మాట్లాడ లేదు. అయినా వ్రజమాత్రం తల్లిసంగతి బాగా తెలిసి వుండడంవల్ల రెండురోజుల్లోనే కారణాన్ని వూహించి కోపంతో మండిపోయింది. ఇంటియజమానురాలికి గోవర్ధన్ నామధేయుడైన మేనల్లుడు ఉన్నాడు. అతను కల్లూ గంజాయీ తాగుతాడు పీలుస్తాడు. అతను ముప్ఫయి అయిదేళ్ళవాడో అరవైఏళ్ళవాడో తెలిసేది కాదు. ఎవరూ అతనికి పిల్ల నివ్వ లేదు. అందుకే ఘోటకబ్రహ్మచారిగా ఉండిపోయాడు. అతనిల్లు రెండోవీధిలో వుంది. మొదట్లో వీరింటికి ఎప్పుడో వచ్చేవాడు. అయినా ఈమధ్య ఏదో అజ్ఞాతకారణంవల్ల మేనత్త మీద ప్రేమా భక్తీ చాలా ఎక్కువైనాయి. గదిలో కైఠా యించి చాలాసేపు లోకాభిరామాయణం మాట్లాడి కొన్ని ఉపదేశాలు పొందేవాడు.

ఇవాళ రెండుజాములకు వ్రజేశ్వరి కుసుమను తీసికొని స్నానానికి వెళ్లింది. నీళ్ళల్లో దిగడంతోటే ఆమెదృష్టి దట్టంగా వున్న కామినీవృక్షంవైపు ప్రసరించింది. గోవర్ధన్ చాటుగా నిలవబడి రెప్ప వాల్చకుండా చూస్తున్నాడు. ఆమె అప్పుడేమీ మాట్లాడకుండా ఇంటికి తిరిగి వచ్చింది. వరాండాలో నిల్చుని గోవర్ధన్ అత్తతో కోతలు కోస్తున్నాడు. కుసుమ ముసుగు ముఖంమీదికి లాక్కొని లోపలికి వెళ్లింది. వ్రజమాత్రం దగ్గిరికి వెళ్ళి "ఏమన్నయ్యా! ఇదివరకు కనపడేవాడివికావు. మామీద ఈమధ్య ఇంత దయ కలిగిందే? లోపలికి రావడం మాత్రం కొంచెం తగ్గించు" అన్నది.

ఈమాటలవల్ల వ్రజ తనను చూసిం దని కనిపెట్టి అతను నిరుత్తరుడైనాడు. అయినా వ్రజతల్లి నిప్పులు కక్కుతూ గుడ్లెర్ర జేసి "మొదట్లో వాడి కిష్టం లేదు. రా లేదు. ఇప్పుడు ఇష్ట మయింది. వచ్చాడు. దానికి నీ దే ముంది?" అని అరిచింది. పిల్లకు కోపం రాలేదు. నెమ్మదిగా అన్నది. నా కిష్టం లేదు. అయినా నే నొక్కదాన్నే కా దమ్మా! వొదిన కూడా ఇక్కడే వున్నది. ఆమె పరాయి మని షన్న ధ్యా నయినా వుండాలి."

తల్లి సప్తమ స్వరం ఎక్కించి అన్నది. "పరాయి మనిషి వుం దని మేనల్లుడు ఇంటికి రాకుండా వుంటాడా? అయినా ఆమె ఏ మంత ఘోషా స్త్రీ? ఆమె అందరి ఎదురుగా తిరుగుతుంటే నాలాటి ముసిలివాళ్ళకూడా సిగ్గేసేది."

కూతురు తల్లి అభిప్రాయం తెలుసుకొన్నది. ఇదివరకు ఆమె

మాటలు విని తనుకూడా చాలా తిట్టింది. అయినా అప్పటి సంగతి వేరు. ఇప్పు డామె కుసుమను ప్రేమిస్తోంది. ఇది కేవలం భగవత్ప్రేరితం. వ్రజ తీవ్రంగా గోవర్ధన్ వైపు చూసి నాకు చెప్పడానికి సిగ్గుగా వుంది. నేను అంతా చూశాను. సోదరుడిలా రా దల్చుకుంటే వస్తూండు. లేకపోతే నీ అదృష్టమే కాకుండా అమ్మ అదృష్టంకూడా మారి పోతుందని తెలుసుకో!" అంటూ గదిలోకి వెళ్ళి పోయింది.

గోవర్ధన్ ముఖం ఎర్రచేసి "అత్తా, నీ మీద ఒట్టు పెట్టి చెబుతున్నాను— నా కేమీ తెలియదు— ఏ వెధవ చెట్టు చాటున— నేను— ఆకులు కోసుకోడానికి — మిఠాయి దుకాణం వాణ్ణి అడుగుదాం పద— ఆమెను రమ్మను వీధిలోకి— ప్రమాణం చేయిస్తాను..." అంటూ గోవర్ధన్ నెమ్మదిగా జారిపోయాడు. వ్రజేశ్వరి బట్టలు మార్చుకుని గదిలోకి వెళ్ళి చూచేసరికి కుసుమ అలానే తడిబట్టలతో బైటికి చూస్తో వుంది. పద ధ్వని విని ఆమె గద్గదకంఠంతో "ఎందుకు వొదినా? నువ్వు నా మాటల్లో ఎందుకు కలుగ చేసుకుంటావూ. స న్నిక్కడ నిలవనియ్యవా." అన్నది.

"ముందు తడి చీరె విప్పెయి. తరవాత చెబుతాను." అంటూ వ్రజేశ్వరి బలవంతంగా పొడిచీర కట్టించి "వొదినా, నే నీ అన్యాయం సహించలేను. ఆ వెధవ దరిద్రుణ్ణి ఇంటి ఛాయలకు రానియ్యను. వాడి అభిప్రాయం తెలుసుకున్నాను." అని సిగ్గుతో తల్లిమనస్సులో మాటను చెప్పలేక పోయింది.

కుసుమ ఏడుస్తూ "ఇలాంటివి కలుగచేసుకుని నన్నింకా విపత్తులో ముంచకు వొదినా!" అన్నది.

"నే నుండగా నీకు, కష్టం ఎలా వొస్తుంది?"

కుసుమ తల తిప్పుతూ "తప్పకుండా వొస్తుంది కళ్ళముందు కనిపిస్తున్నది." అని నొసట చెయ్యి వేసుకొని "ఈకాలిపోయిన అదృష్టాన్ని ఎక్కడికి తీసుకు వెళ్ళినా వొస్తున్నది. బహుశా భగవంతుడుకూడా నన్ను రక్షించలేడు" అంటూ ఏడవ సాగింది. వ్రజ స్నేహపూర్వకంగా కళ్ళు తుడిచి కొంతసేపటికి "నిజమే. వొదినా, నువ్వు కోపగించకు. అదృష్టాన్ని నిందించడంవల్ల ఏమీ లాభం లేదు. నీ వేం తక్కువదోషం చేశావో." అనేసింది.

కుసుమ వొదినవేపు చూస్తో "నే నేం తప్పు చేశాను? నాచిన్నప్పటి సంగతులన్నీ వినే వుంటావు." అన్నది.

విన్నాను. శుద్ధ అబద్ధం అవన్నీని. నువ్వు పెద్దదాని వయ్యావు. అన్నీ తెలుసుకో గలుగుతావు. అయినప్పటికీ నొసట తిరుచూర్ణం పెట్టుకోవు చేతులకు గాజులూ తొడగవు. అత్తారింటికి అసలే వెళ్ళవు. ఇది అదృష్టమా? నీతప్పా? నీవే చెప్పు. భర్త వున్నస్త్రీ ఎవత్తె అయినా కోపంతో విధవ అవుతుందా."

"వొదినా, నా కి వన్నీ తెలుసు. బొట్టెట్టుకుని, గాజులు తొడుక్కునంత మాత్రాన లోకులు వొప్పుకోరూ భర్త ఎవరు? సాక్ష్యం ఎవరు? అని అడుగుతారు. వారుకూడా నన్నింటికి ఎలా తీసుకు వెడతారు?"

వ్రజేశ్వరి విస్మయంతో "ఇ వ్వేంమాటలు వొదినా! ఇంత కంటె పెద్దసాక్ష్యం ఏం కావాలి? దీన్ని గురించే నందుడితో మనింట్లో ఎంత పెద్దకాండ అయిందో నీకు తెలియదూ?" అని క్షణం ఆగి "మీఅన్నయ్యకు అన్నీ తెలుసు. వారు చెప్పే రనుకున్నాను. తిరిగి చెబితే ను వ్వేమైనా అను కొంటా వేమో నని నేను చెప్పలేదు. అంతే కాకుండా నువ్విక్కడికి వచ్చినకారణం నాకు చాలా కోపం తెప్పించింది!" అన్నది కుసుమ. ఉద్వేగంతో "కాదు వొదినా! నా కేమీ తెలియదు. ఏ మయిందో చెప్పు."

వ్రజేశ్వరి నిట్టూర్పు విడిచి ఇలా అన్నది: "బలే! అన్న లాగే చెల్లెలూ అన్నగారికి నందుడికూతుర్ని ఇవ్వడం నిశ్చయం అయినప్పుడు నువ్వు యాత్రలకు వెళ్ళావు. ఆసమయంలో మీ అన్నగా రీగొడ వంతా పెంచారు. చివరకు వారే ఏమీ మాట్లాడకుండా వూరుకొన్నారు. మాఅత్తగార్ని గురించి, నిన్ను గురించి, వారిని గురించి అన్నిమాటలూ జరిగాయి. పెళ్ళి సమ్మంధం పా డవుతుం దని నంద బాబయ్య భయపడ్డాడు. తర్వాత దేవాలయపు బాబాజీని పిలిపించారు. ఆయన వచ్చి అన్నీ అబద్ధ మని తీర్పు చెప్పాడు. ఎందుకంటే వారి ఆజ్ఞ లేకుండానే కులంలో ఈపను లన్నీ జరిగాయి. తర్వాత ఆపని చేసినవాణ్ణి తీసుకు ర మ్మని నందబాబయ్యను ఆజ్ఞాపించారు. అదేసమయంలో ఇ వన్నీ అబద్ధా లనీ కేవలం మారుమనువు ప్రస్తావనమాత్రం జరిగిం దనీ నిర్ధారణ అయింది."

కుసుమ బలవంతంగా శ్వాసబిగబట్టి అన్నది: "ఇంతేనా

నిజమే? వొదినా, నేనుకూడా నిజ మనుకొనేదాన్ని, అయినా ఈమాట లన్నీ ఎలా జరిగాయి?''

వర్జిజ నవ్వుతూ అన్నది? "మీ అన్నగారికి అప్పుడప్పుడూ పిచ్చెక్కుతుంది? ఇంకోడయితే ఈ కొద్ది కారణానికే ఇంత గోల చెయ్యడు. వారికీ ధ్యాసే లేదు. నాలుగు వైపులా ఒకటే గొడవ. చెల్లెలి దేమీ తప్పు లేదు గద. బావగారు ఎందుకు తీసుకు వెళ్ళరు? సైగా నందుడు తనకూతుర్నిచ్చి పెళ్ళి చేస్తాడో?"

కుసుమ సిగ్గుతో "ఛీ ఛీ తరవాత ఏ మయింది?''

"తరవాత ఏమీ కాలేదు. మా అత్తగారు, నందుడి కోడలు ఒకేవూరి పిల్లలు. కోపంతో నిన్నీవూరు తీసుకొచ్చారు. ఆయన కొడుక్కే ఇవ్వా లనుకొన్నారు. నిశ్చయం అయింది. కాని కాలేదు. సరిగానే వొదినా, అన్నగారిదంతా విన్నారు గదా. నీతో ఏం చెప్పలేదా? మొదట్లో విన్నాను. వారు—''

కుసుమ ముఖం తిప్పి "అవును వొదినా. వా రారోజున అదే చెప్పడానికి వచ్చిన ట్లున్నారు.'' అన్నది.

వర్జిజ ఆశ్చర్యంతో "ఏరోజు? ఈ మధ్యన వారు నీ దగ్గిరికి వొచ్చారా.'' అని అడిగింది.

"అవును. మే మిక్కడికి వచ్చినరోజు ఉదయం.''

"అప్పు డే మయింది?''

"నా తప్పు వల్ల ఏమీ చెప్పకుండా వెళ్ళిపోయారు.'' వర్జిజ నవ్వుతూ "ఏం? ఇంట్లోకి రానీలేదా.'' అన్నది. కుసుమ జవా

బిన్నాక తల వాల్చి కూర్చున్నది. వ్రజకూడా ఇంకేమీ అడగ లేదు. సంజచీకట్లు కమ్ముతున్నాయి. వ్రిజ ఇంట్లోకి వెళ్ళి కొంచెంసేపు ఆగి తిరిగి వచ్చేసరికి కుసుమ వెక్కి-వెక్కి- ఏడుస్తున్నది. వ్రిజ మెల్లగా "వొదినా, నువ్వు చాలా పొరపాటు చేశావు. ఏం చేశావో నాకు సరిగా తెలియదు. వారు భర్తని తెలిసికూడా అనుమతి తీసుకోకుండా ఇంకో చోటికి వెళ్ళడం మంచిపని కాదు."...... "నీవల్ల విన్నమాటల్ని బట్టి చూస్తే నడిచైనా నీవు వారింటికి వెళ్ళి వుండవలసింది. నేనయితే అలానే చేసేదాన్ని." అని చెప్పింది.

కుసుమ అస్ఫుట స్వరంతో "వొదినా, చెప్పడం సులభమే గాని చెయ్యడం చాలా కష్టం." అన్నది.

"బొత్తిగా కాదు. వెడితే భర్త కొడుకు లభిస్తాడు. పైసాకు కూడా లోపం ఉండదు. అది లేకపోయినా నేను తిరిగి వచ్చేదాన్ని కాదు. భర్త కొడతారన్న భయమైనా లేదు గద. మహా అయితే పో అంటారు. నామాట విని వెళ్ళు. నువ్విలా ఆయినా వుండిపోతే ఏం చెయ్యగలుగుతావో చెప్పు!"

వ్రిజేశ్వరిమాటలు విని ఇంత దుఃఖంలోకూడా కుసుమ విరగబడి నవ్వింది. వ్రిజేశ్వరి ఇంకా ఎక్కువగా నవ్వనీ లేదు. నవ్వడానికి గాని, సానుభూతి చూపడానికి గాని ఆమె మాట్లాడ లేదు. తన మనస్సులో వున్నమాటే చెబుతోంది. ఆమె ఇంకా గంభీరంగా "వొదినా, నువ్వెవరిమాటా వినక అత్తారింటికి వెళ్ళమ్మా. ఇంత కష్టసమయంలో మొగుణ్ణి పిల్లల్ని వొదిలి వుండడం మంచిది కాదు." అన్నది. వ్రిజ స్వరంలో కలిగిన

ఆకస్మిక పరివర్తనాన్ని గమనించి కుసుమ "ఇంత కష్టసమయం ఏమిటి?" అన్నది.

"కష్టం కాకపోతే ఇంకేమిటి? బాడలలో కలరా ఎక్కువగా వుందని మీ అన్నయ్య ఇప్పుడే చెప్పారు. ఆఁ ఇదేమిటి? నా కళ్ళు పట్టుకోకు." కుసుమ ఆమె రెండుకాళ్ళూ పట్టుకుని ఏడుస్తూ "వొదినా, వారు చరణుని ఇవ్వడానికే వొచ్చారు. కాని నేను తీసుకోలేదు. వారి మాట నేను పెడచెవిని పెట్టాను వొదినా......" అన్నది.

వ్రిజేశ్వరి అంతటితో ఆపి అన్నది. "మంచిది· ఇప్పుడు విన్నావు కద. అందుకే త్వరగా వెళ్ళు. "నేనిప్పుడు ఎలా వెళ్ళేది?"

వ్రిజ ఏదో మాట్లాడా లనుకొంటూ ఉండగానే వెనక అడుగుల చప్పుడు వినపడ్డది. తల్లి గుమ్మందగ్గర నిలబడింది, అటు వైపు చూడగానే ఆమె హేళనతో "వొదినగారికి ఏదో సలహా ఇస్తున్నావు!" అన్నది. వ్రిజు స్వాభావిక స్వరంలో "లోపలికి రామ్మా. భయపడకు· తన వారి కెవరూ చెడు సలహా ఇవ్వరు." అన్నది. తల్లి చాలసేపణ్ణించి లో లోపల మండిపోతున్నది. ఆజ్వాలలు బైటికి వదిలింది. "నువ్వనడం నేనందరికీ చెడు సలహాలు ఇస్తాననే గదా? ఈ దరిద్రపుది నా కొంపలో అడు గెట్టేప్పటికి అనుకొన్నాను. పచ్చనికొంప మాపుతుందని. "కుంజనాథుడు దాంతో సరిగా ఎందు కుండడనుకొన్నావు? దాని వేషం స్వభావం చూడరాదూ?"

కుసుమ వ్రిజను సమాధానం ఇవ్వకుండా చేసింది. వ్రిజ

నెమ్మదిగా అన్నది. "అందుకే ఈ దరిద్ర గొట్టుదాన్ని అత్తారింటికి పొమ్మంటున్నాను." తిలకం తీర్చి దిద్దిన నాసిక చిట్లించి తాంబూలరక్తిమతో వున్న పెదవుల్ని చాపుతూ అన్నది. "ఏ అత్తారింటికి వొదినగార్ని పంపించేది? నందవైష్ణవుని—"

ఈ పర్యాయం వ్రిజేశ్వరి గర్జించి, "అన్నీ తెలిసికూడా ఇతర్లను అవమానం చెయ్యకు. ఆడుపిల్లలు అరవయ్యేళ్ళు అత్తారిళ్ళు ఉండవు. ఇవాళ నందవైష్ణవు డన్నావు, రేపు గోవర్ధన అంటావు నీ మాట లన్నీ విని ఊరుకోవాలి." అన్నది. తల్లి కూతురు మాటలు విని తుపాకీమందులా పేలింది. "పో, దరిద్రురాలా! బిడ్డవై ఉండి నామీద అంత అపవాదు వేస్తావా!"

కూతురు వ్రిజేశ్వరి అన్నది. "ఉన్నమాట అంటే అపవాదు అంటావా? నీలాంటి నలుగురైదుగురు వైష్ణవ స్త్రీలకృసవల్ల మాలవాళ్ళని చెప్పుకో వలసివస్తుంది. ఊరికే కేక వెయ్యకు. నీమీద అపవాదు పడిం దనే దుఃఖం వుంటే, వెంటనే వొదిన గార్ని బాడల పంపించు. తరవాత నీయిష్టం వచ్చినట్టు నన్ను దులిపేద్దువు గాని. అప్పుడు ని న్నేమన్నా అంటే వొట్టు."

ఈవాగ్యుద్ధంలో ఎక్కువసేపు పాల్గొంటే తనకు ఓటమి తప్ప దని తల్లి కోమలస్వరంతో "ఈమెను ఎలా రానిస్తారు వాళ్ళు? వ్రిజేశ్వరీ, నీకన్న నా కెక్కువలోకానుభవం వుంది. వాళ్ళు కుసుమను సుతరాం పలకరించరు. బృందావనుకు కుసుమకు ఏమీ సంబంధం లేదు. వూరికే గొంతెన్నాకోర్కెలు పెరేపించకు." అంటూ వెళ్ళిపోయింది. వ్రజేశ్వరి వాలిపోయిన కుసుమ మొగం చూస్తూ "అంతా అబద్ధ మమ్మా! ఆమె

చెప్పా లనే అబద్ధా లాడింది. మంచిది వెళ్ళి వస్తాను" అంటూ వర్ణిజ లోపలికి వెళ్ళిపోయింది.

స్థితిగతులతోపాటు బుద్ధికూడా బాగుంటుందని కుంజనాథుడు నిరూపించాడు. చెల్లెలూ భార్యా పడేఆవేదన అతనికర్తవ్య పథంనుంచి విచలితుణ్ణి చెయ్య లేదు. తల ఊపుతూ "అత్త గారు వప్పుకుంటే గాని నేను చరణుణ్ణి ఇక్కడికి తీసుకు రాను" అన్నాడు. వర్ణిజేశ్వరి "మీరు చూడాలి అయినా రండి." అన్నది.

కుంజుడు కళ్ళు తేలవేసి "అమ్మ బాబోయ్! అక్కడ రోజూ ఇరవైమంది చచ్చిపోతున్నారు!" అన్నాడు.

"ఎవ రయినా మనిషిని పంపండి" అన్నది వర్ణిజేశ్వరి.

సరే అంటూ కుంజుడు మనిషికోసం బైటికి వెళ్ళాడు.

రెండోరోజు స్నానం చేసి వంటింట్లోకి వెళుతూంటే ఊడుస్తూన్న దాసి కుసుముతో "అమ్మగారు మిమ్మల్ని వంటింట్లోకి వెళ్ళవద్దన్నారు" అని చెప్పింది.

ఎందుకు?

"నాకు తెలియదు అన్నది దాసి. కుసుమకు ఇవాళ వర్ణిజ కనపడ లేదు. ఆమెను వెతుకుతూంటే వర్ణిజతల్లి వచ్చి "అమ్మాయీ, ఎందు కాలస్యం చేస్తావ్? వెళ్ళి రెండుమునకలు వేసిరా. మీఅన్నగారు సలహాకోసం ఠాకూర్‌వాడీ వెళ్లారు" అన్నది.

కుసుమ ఏదో అడగా లనుకొన్నది. నాలుక బైటికి వచ్చి అలానే ఆగిపోయింది. అప్పుడు ఆమె జాలిగా అన్నది: "నీవు కోడలి వైనప్పుడు కొడుకుతోపాటే మైల పట్టాలి. పోనీ అయిం దేమో అయింది. ఆ మనసుందిమనిషి. వర్ణిజసమ్మం

ధానికి వొచ్చినప్పుడు ఎన్నోమాటలు మాట్లాడింది. పాపం! ఆ అన్నట్టు ఆకురాళ్ళ్లీడి పే రేమిటి? చరణ్ కాదూ? పాపం, దొరంటిబిడ్డ వాడిప్పుడూ తగిలింది."

కుసుమ ఏమీ మాట్లాడకుండా గదిలోకి వెళ్ళిపోయింది. దాదాపు మూడు గంట లయింది. వ్రిజ అన్నిగదుల్లోనూ వెతికింది. కాని కుసుమ కనిపించ లేదు. చివరకు దాసీదాన్ని అడిగితే పొద్దున అమ్మగోరిని చూశానండి అన్నది. భార్యస మస్య విని కుంజుడికనుకుకు భంగపాటు కలిగింది. "ఏమయింది? ఎక్కడికి పోయిందని" అని అడిగాడు కుంజ.

వ్రిజ ఏడుస్తూ "ఎక్కడ వెతికినా కనపడదు" అని చెప్పింది భార్యకన్నీళ్ళు తుడిచి కుంజనాథుడు ఏడ్చాడు. "ఆమె ఇంకా బతకదు. అత్తగారిమాటలు వినలేక నీళ్ళల్లో మునిగిపోయిందేమో!" అంటూ వ్రిజ ఎంత వొ ద్దన్నా ఆగకుండా కుంజుడు పిచ్చివాడిలా పరుగెత్తాడు. పదినిమిషాలకు అతను తిరిగి వచ్చి ఆడదానిలా ఏడుస్తూ "అత్తగారు నాచెల్లెల్ని చంపేసింది! ఇంక ఇంట్లో అడుగు పెట్టను. అయ్యో చెల్లీ!..." అన్నాడు.

ఏమీ తెలియనిఅత్తగా రొచ్చి నిలబడగానే కుంజుడు తల బాదుకుంటూ అన్నాడు, "ఈరాక్షసే నా చెల్లాయిని మింగింది. అయ్యో, చావడానికి నే నెందుకు ఇక్కడికి వచ్చాను" వ్రిజ దగ్గిరికి రాగానే ఆమెను దూరంగా తోసివేశాడు. అయినా ఆమె లెక్క చెయ్యకుండా అతన్ని గదిలోకి తీసుకు వెళ్ళి అన్నది: "ఏడుస్తూ మొత్తుకుంటే చెల్లెలు తిరిగి వస్తుందా? వొదిన మునిగి చావదు." ఆమాటను నమ్మక ఏడవడం సాగించాడు. ఈ

చెల్లెల్ని, అతను కష్టాలు పడి పెంచాడు. ప్రాణాలకన్నా ఎక్కు-వగా చూశాడు. మొదట ఎన్నో సార్లు కోపంతో ఎందులోనన్నా పడి చస్తా నని బెదిరించింది ఈమాటలు తల్చుకుంటున్న అతని కన్నీళ్ళల్లో కుసుమ దేహం తేలుతున్నది! వ్రజేశ్వరి భర్తకన్నీళ్లు తుడుస్తూ "ఆ తప్పకుండా అత్తారింటికి పోయివుంటుంది." అన్నది. కుంజనాథ్ నమ్మ లేదు. అతను తల తిప్పుతూ "అక్కడికి అసలే వెళ్ళదు. చరణ్ వదిలి ఇతర్లను చూడడానికి ఇష్టపడదు." అని చెప్పాడు. వ్రజ "అదే మీపొరపాటు నేను మిమ్మల్ని ప్రేమించినట్టే ఆమెకూడా తనభర్తను ప్రేమిస్తుంది. కేవల చరణ్ కోసం వెదుతుందా?" అన్నది.

"అయినా దానికి బాడల వెళ్ళేతోవకూడా తెలియదు."

నాకూ అదే భయం. ఎలా గయినా వెళ్ళే వుంటుంది. నామాట విని మీరూ ఆతోవనే వెళ్ళండి. కనిపిస్తే భర్తదగ్గిరికి పంపండి."

"వెదుతున్నా" అంటూ కుంజుడు వెళ్ళిపోయాడు. ఇవాళ మెరుస్తున్న విదేశీజోళ్లు, విలువైన పట్టుఖండువా, జంమీాం దారుఠీవిగల నడకా అత్తగారింట్లోనే ఉండిపోయాయి! నిర్భాగ్యురాలు అయిన కుసుమకోసం జమీాందార్ కుంజనాథ్ బాబు మాటలు మోసే కుంజవైష్ణవునిరూపంలో కాళ్ళకు జోళ్ళు లేకుండా, వొంటికి చొక్కా లేకుండా పిచ్చివాడిలా పరుగెత్తాడు.

[ ౧౪ ]

బృందావన్‌తల్లికి స్వర్గం చేకూరిందో లేదో ఎవరికీ తెలియదు. చనిపోయిన తర్వాత తమసుకృతంవల్ల స్వర్గానికి ఎవరయినా నిజంగా చేర గలిగితే, బృందావన్‌తల్లికి కూడా స్వర్గంలో స్థానం లభించి వుంటుం దేమో!

తారిణీ దుర్వ్యవహారంవల్లా ఘోషాల్ శాస్త్రపాండిత్యం వల్లా కలిగినశాపాలతో దుఃఖితుడై బృంద తనగ్రామంలో ఆధునికపద్ధతులతో పంపునుయ్యి ఏర్పాటు చేయించడానికి సంకల్పించాడు. దానివల్ల ఇంక కలరాభయం వుండ దని అతని నమ్మకం ఇందుకే కలకత్తాలో వున్న వ్రిజ్ధకంపెనీకి వ్రాసి మనిషిని పిలిపించాడు. వెంటనే వాడు రాసుకునా రు.

తల్లి ఆకస్మికమృతి తర్వాత అతనికి విచారపడే శక్తికూడా నశించింది.ఇటు చరణ్ కూడా ఆట పాటా మానేసి ఒకచోట పడి వుంటున్నాడు. ఈమధ్య కొన్నిరోజులబట్టీ దుర్గాదాస బాబు వచ్చి ఏవో మాటలు చెప్పేవాడు. కాని బృందావన్ వాటిని గ్రహించ లేకపోయేవాడు. తుపాన్‌లో చిక్కుకుని కంపిస్తూన్న ఓడలాగా వుండేవా డతను. ఇంటిదాసీది వచ్చి ఏడుస్తో 'ఇ దేంటి బాబుగోరూ? పిల్లోణ్ణికూడా పోగొట్టుకుంటా రా? సూడండి అబ్బాయిగో రెలాగున్నారో?'' అన్నది.

బృందావన్ చకితుడై అడిగాడు "ఏ మయింది వాడికి?'' అన్నాడు. చరణుడు నెమ్మదిగా దగ్గిరికి వచ్చాడు. బృందావన్ వాణ్ణి కౌగలించుకుని ఏం నాయనా, నువ్వుకూడా పోతావా? అన్నాడు. దాసీది కోపంతో అ దేంటి బాబుగోరూ? అన్నది.

కొంచెంసేపు ఆగి చరణ్ నేను అమ్మదగ్గిరికి వెడతాను నాన్నా అన్నాడు

అమ్మ అక్కడ లే దమ్మా అన్నాడు తండ్రి

"ఎప్పు డొస్తుంది?"

"తెలియదు నాయనా! అయినా ఇవాళే మనిషిని పంపి తెలుసుకుంటాను."

చరణ్ చాలా సంతోషించాడు. బృందావన్ కొంతసేపు ఆలోచించి కేశవుడికి తనఅవస్థ తెలుపుతూచరణును తీసుకు వెళ్ళ మని రాశాడు తల్లిమాసికం రెండురోజులే వుంది. ఉదయం చండీమండపంలో పనిపాటల్లో వున్నబృందావనుకు తెలిసింది కొడుక్కు కలరా తగిలిం దని. వెళ్ళి వాడిమంచందగ్గర జీవచ్ఛవంలా పడుకుని కేశవునకు కబురు చెయ్యండి అన్నాడు. గం టయింది .బృందావన్ డాక్టర్ గోపాల్ కచేరీసావట్లోకి వెళ్లి అతనికాళ్ళుపట్టుకుని "డాక్టర్‌గారూ, దయ వుంచి పిల్లవాణ్ణి కాపాడండి. నేను ఎన్ని అపరాధాలు చేసినా వాడు మాత్రం నిర్దోషి. వాణ్ణి చూ స్తే మీ కే జాలి వేస్తుంది." ప్రార్థించినాడు.

గోపాల్ ముఖం తిప్పి ఆరోజు తెలియదా ఏమిటి? తారిణీ ముఖ్యోపాధ్యాయుడు డాక్టర్ గారి మేనమామ మేనని —తక్కువవాడ వై బ్రాహ్మల్ని అవమానిస్తావా? వీళ్ళకాళ్ళమీదే పడా లని ఇప్పుడు తెలిసిం దేం?" అన్నాడు.

బృందావన్ ఏడుస్తూ "నేను వారిని ఏమీ అన లేదు.

మీరు డాక్టర్‌గారు కదా. నీటిని అపరిశుభ్రం చెయ్యడం అన్యాయమని తెలియదా!'' అన్నాడు

గోపాల్ కాళ్ళు వదించుకుని "అన్యాయం కాక మ రేమిటి! ఇదంతా రూపాయలమధం! వెళ్ళువెళ్ళు! మీ ఇంట్లో అడుగయినా పెట్టను'' అన్నాడు.

బృందావన్ మళ్ళీ ప్రార్థించాడు. తప్పయింది బాబూ! ఒక్కసారి రండి. నూరురూపాయ లిస్తాను అయిదువందలయినా ఇస్తాను. వచ్చి మం దివ్వండి.''

అయిదువందల రూపాయలే! డాక్టర్ గోపాల్ మెత్తపడి పోయాడు, "తమ్ముడూ! మీ ఇంటికి రాగానే నన్ను వెలి వేస్తారు. ఇంట్లో కార్యకలాపాలు జరిగే వీ లుండదు. ఒక ఉపాయం చెబుతా, చెయ్యి. ఘోషాల్ మహాశయుణ్ణి తీసుకుని మామగారిదగ్గరకు వెళ్ళు. వారి కాళ్ళు గడ్డం పట్టుకుని బతిమాలు. చాలు అంతే! వెంటనే నేను వస్తాను. చూడు, చాలా గొప్పమందులు తెచ్చాను ఇప్పుడే! ఇవ్వగానే కుర్రాడికి నయమవుతుంది. చూడు, అక్కడ రూపాయలమాట తలపెట్టకు సుమా!''.

అదివరకుమాదిరిగా బృందావన్ వెళ్ళి తారిణి శ్రీచరణాల మీద పడ్డాడు. తారిణి ఒక్కతన్ను తన్ని అట్టహాసం చేస్తూ "నేను సంధ్యావందనం చేసుకోందే నీ ళ్ళయినా తాగను. నేను అన్నట్టయింధా లేదా! ఋషులసంతానం మేము, మాట ఊరికే పోతుందా?'' అన్నాడు.

బృందావన్ ఏడుపు విని తారిణిభార్య పరుగెత్తుకొంటూ

వచ్చి స్వయంగా కళ్ళ నీళ్ళు పెట్టుకుని భర్తతో "ఛీ ఛీ! ఇలా అన్యాయం చెయ్యకండి. అయిం దేమో అయింది. పాపం, చిన్నకుర్రాడు. గోపాల్ తో మం దివ్వ మని చెప్పండి" అన్నది.

తారిణి అరుస్తూ ఛండాలపుదానా! మొగాళ్ళమధ్యకు రాకు! అన్నాడు. ఆమె తడబాటుతో బృందావణ్ తో "వెళ్ళునాయనా ఆశీర్వదిస్తున్నాను!" అంటూ లోపలికి వెళ్ళిపోయింది. ఎన్ని ప్రార్థన లయినా పురుషసింహుడు తారిణి మనస్సును చలింప చెయ్యలేక పోయాయి. ఈసమయంలో పక్కింట్లోంచి శాస్త్రజ్ఞ ఘోషాల్ మహాశయుడు పావుకోళ్ళచప్పుడుతో ప్రవేశించాడు. మాట లన్నీ విని ప్రసన్నవదనంతో "శాస్త్రాల్లో ఏం రాసి వుందీ, అంటే, కనకపుసింహాసనంమీద శునకాన్ని కూర్చుండ బెడితే తిరిగి వచ్చి నెత్తి నెక్కుతుం దట తక్కువవాళ్ళను శాసించకపోతే సంఘం భ్రష్ట వుతుంది. ఇలాగే కలికాలంలో ధర్మఖర్మం! బ్రాహ్మణసన్మానములు అన్నీ అడుగంటుతున్నాయి ఏం తారిణీ నేం చెప్పలేదూ నామాట విన్నప్పుడే బ్రహ్మ రాత మారింది. చూడు, తారిణీ మన మనుకున్న ఫలం ఎలా లభించిందో" అన్నాడు. తారిణి తనఅధికార్యాన్ని నిరూపించ దల్చుకుని అన్నాడు "నేనూ వంశనిర్మూల మయ్యేటట్టు శాపం పెట్టాను. ఇప్పుడు కూడా చంద్రుడూ నకాలంలోనే వస్తున్నారు. నాతపోజ్వాలకూడా మండుతూనే వుంది." అజ్ఞానాంధవిశ్వాసం పుత్రవియోగాన్ని అతిక్రమించి పోయింది.

అశుమక్కమీమాంస ముదియకముందే బృందాన్ ఇంటికి చేర్రాడు. కేశవుడు కుర్రవాడికి పరిచర్యలు చేస్తున్నాడు. బృందను

చూడగానే అతను గాఢవిశ్వాసం వదలి వెంటనే లేచి నిలబడి కండువా పైన వేసుకుని "నేను కలకత్తా వెళుతున్నాను. డాక్టర్ దొరికితే సాయంకాలం వచ్చేస్తాను. లేకపోతే నా జీవితలో నీకు ముఖం చూపించను! తలుచుకున్నంత మాత్రానే గుండె పగులుతుంది బృందా! అంటూ త్వరగా వెళ్ళిపోయాడు. పొద్దు ఎక్కినకొద్దీ చరణ్‌కు దప్పిక, అమ్మను చూడాలనే అరుపు ఎక్కువైనాయి.

పొద్దుకూకే సమయానికి డాక్టరుతో కేశవ్ ప్రవేశించాడు. డాక్టర్ అతనిసమవయస్కుడయినమిత్రుడు. చరణును చూడగానే అతనిముఖంమీద గంభీరచ్ఛాయలు ఆవరించాయి. కేశవ్ బృందావన్‌ముఖం చూసి ఏమీ మాట్లాడలేకపోయాడు. బృంద శాంతభావంతో "సందేహిస్తారేం డాక్టరుగారూ? ఉన్న ఒక్కకొడుకున్నూ చికిత్స చేయించలేని తండ్రి అన్నీ సహించగలుగుతాడు." అన్నాడు.

తండ్రిధైర్యం చూచి డాక్టర్ చకితుడయినాడు ఏమీ చెప్పలేక తల వొంచుకున్నాడు. బృందావన్ దానిఅర్థం గ్రహించి "సరే కేశవ్. నేను వెళ్ళి దేవుడిగదిలో వుంటాను అవసరమయినప్పుడుపిలిపించు! ఇంకోమాట చివరగడియలో నాకు కబురు చెప్పు! ఇంకోసారి వాణ్ణి చూచుకుంటాను!" అంటూ వెళ్ళిపోయాడు.

దేవుడిగదిలోకి వెళ్ళి బృందావన్ ఆలోచిస్తూ పడుకొన్నాడు ప్రతిదీ మనమంచికే జరుగుతుందంటారు కాని నాకు ఆ మాటమీద విశ్వాసం లేదు, నావిశ్వాసానికి అతీతంగా వున్న

నీశక్తిని గుర్తించడానికి ప్రయత్నంమాత్రం చెయ్యకుండా వుండలేను ప్రభూ!"

కొన్ని గంటలు గడిచాక చీకటివేళ బృందావన్ గది బైటికి వచ్చాడు. గుమ్మందగ్గిర మాసినబట్టలతో వున్న స్త్రీని చూచి విస్మితు డయినాడు. సమీపించి కుసుమ అని తెలుసుకున్నాడు. అతనినాలుక చివరదాకా మాట వచ్చింది "నాసుఖం చూడ్డానికి వచ్చావా కుసుమా?" అని. అయినా అతను అనలేకపోయాడు ఈసమయంలో వాదప్రతివాదాలు తనకొడుకు ఆత్మశాంతికి భంగం కలిస్తాయి యని కరుణస్వరంతో "నీవు కొంచెం ముందు వచ్చివుంటే చరణుడికుతూహలం తీర్చేదానివి! నీకోసం అరుస్తోండగానే వాడికి స్మృహ తప్పిపోయింది!" అన్నాడు.

కుసుమ నిశ్శబ్దంగా భర్తవెంట నడిచింది. ద్వారందాకావెళ్లి కొడుకుమృత్యుశయ్య చూపుతూ బృందావన్ అన్నాడు: అక్కడ పడివున్నవాడే చరణ్. వెళ్లు వాణ్ణితీసుకో—కేశవ్. ఈమె చరణ్ తల్లి! ఇలా అంటూ అతను మెల్లిగా వెళ్లిపోయాడు

రెండోనాడు ఉదయం కుసుమను పలకరించేసాహసం ఎవరికీ లేకపోయింది. చివరకు కుంజుడుకూడా భయపడి పోయాడు. బృందావన్ దగ్గిరికి వచ్చి "ఈకట్టెను చేతులో పట్టుకుని లాభమేమిటి? వదులు వాళ్ళు తీసుకుపోతారు" అన్నాడు.

కుసుమ తలెత్తి "వారిని రమ్మని చెప్పండి. నా చేతుల్లోనే ఇస్తాను!" అన్నది. దీని తర్వాత చలించకుండా ఆమె చరణ్ మృతశరీరాన్ని శ్మశానానికి పంపేప్పుడు చూచి, బృందావన్ కూడా తనలో తనే భయపడ్డాడు.

[౧౫]

చరణ్ చిన్న శరీరం కాలి మసికావడానికి ఎంతోసేపు పట్ట లేదు. కేశవుడు చూస్తూ చూస్తూ భయంకరంగా అరిచి నాడు "ఇదంతా అబద్ధం! భగవంతుడు ప్రతీది మంచికోసం చేస్తాడనే ఆశావాదులు పిశాచాలు! బుద్ధిహీనులు! దురాత్మ గ్గులు!" బృందావన్ ఎర్రని కళ్ళు పైకెత్తి "కేశవా! శ్మశానంలో క్రోధం పనికిరాదు." అన్నాడు.

ఇంటికి తిరిగి వచ్చేటప్పుడు దొమ్మరివాళ్ళ పిల్లవాళ్ళు ఆడు కొంటున్నారు. వాళ్ళను చూచి బృందావన్ మిత్రునివైపు ముఖం పెట్టి అన్నాడు: "నిన్నటినుంచే నేను వేసుకొంటున్న ప్రశ్నకు ఇప్పుడు ప్రత్యుత్తరం దొరికింది. ప్రపంచంలో ఉన్న ఒక్క కొడుకూ పోవడం వల్లకూడా కొంత ప్రయోజనం ఉన్నది.", కేశవుడు ఈ అద్భుత సిద్ధాంతం విని ఆశ్చర్యపడి పోయాడు. బృంద అన్నాడు. "నీ కెవరూ పిల్లల్లేరు. ఎన్ని ప్రయత్నాలు చేసినా నాకడుపు మంట నీకు అర్థం కాదు. ఈ జ్వాల పగవాడికైనా వొద్దు. అయినా కేశవ్! దీనికి కూడా కొంత విలువ వుంటూ ఉంది. అందుకే భగవంతుడు ఇలా చేశాడు." కేశవుడు ఏమీ మాట్లాడ లేదు. అతను చెబుతూ పోయాడు. "నామంట ఈ పిల్లల ముఖాలు చూస్తుంటే శమిస్తున్నది. వాళ్ళల్లో నాచరణ్ కనిపిస్తున్నాడు. ఇప్పుడు పిల్లలందర్నీ కౌగలించుకోవాలని తహ తహా! చరణ్ బతికి వుండగా ఒక్కనాడు కూడా ఇలా అనిపించ లేదు." తోవలో వనమాలి, వాడి తమ్ముడూ వెళుతూంటే బృందావన్ వాళ్ళను పిలిచాడు వని

మాలి అన్నాడు. "పండిత్ జీ! అయ్యకు అంబ లిచ్చి రావడానికి వెడుతున్నాను." బృంద వాళ్ళను దగ్గిరికి రమ్మని పిల్చి ఇద్దర్నీ కౌగలించుకుని "గుండెలు అమ్మయ్య! చల్లపడ్డాయి! కేశవ్— నాచరణాణ్ణి ఏనాడో తిరిగి పొందుతాను." అన్నాడు.

కేశవుడు భయంతో— "వాళ్ళను వదిలెయ్. వాళ్ళ తల్లి చూస్తే ఏమన్నా అనుకొంటుంది," అంటే నిజమే అంటూ బృందావన్ వాళ్ళను వదిలేశాడు.

కేశవ్ అతనిచేయి పట్టుకొని నడు వెడదాం అన్నాడు.

"భాయీ! నే నీవేళ చూపిన వాచారంభణాన్ని క్షమించు. నేను గోహత్య బ్రాహ్మణహత్య చెయ్య లేదు. అయినా భగ వంతుడు .. అర్ధోక్తిలోనే కేశవ్ గర్జించాడు: ఆ ముసిలిపీనుగు ఘోషాల్‌ను అడుగు. వాడు తన జపప్రభావంవల్ల జరిగిం దంటాడు. ఇంకో పిచ్చిముండావాణ్ణి అడుగు. వాడి పూర్వజన్మ అంటాడు, ప్రారబ్ధ మంటాడు! ఉహ్! వీళ్ళే ఈ దేశానికి బ్రాహ్మలు!"

"కేశవ్" కృష్ణసర్పవృతోకను ఖండఖండాలుగా చేసి ప్రయోజనం లేదు. పాతనేతిలో వున్నదుర్గంధానికి పాలే కారణం అనడం పొరపాటు. చూడాలిసిం దేమంటే అజ్ఞానం బ్రాహ్మణుల్ని కూడా ఎంతదూరం తీసుకు పోయిందో నని.

"అయితే ఈశిక్ష ఎందుకు?"

"నేను పాపిని అనుకుని ఆత్మవిశ్వాసం పోగొట్టుకో లేను. నాకు జ్ఞాపకం వున్నంతవరకూ నే నేమీ తప్పు చెయ్య లేదు. ఆ వాళే నేను శుద్ధి పొందాను. నీవు బ్రాహ్మడివి. ఈరోజు

నేను పొందినఅనుభవం చిరస్థాయిగా నాహృదయంలో వుండేట్లు ఆశీర్వదించు.''

తర్వాత స్నేహితులిద్దరూ వెక్కి-వెక్కి ఏడ్చారు. ఇదివరకు బృందావన్ ఒక్క-నుయ్యివమాత్రమే ఏర్పాటు చేయించాలను కున్నాడు. కాని అది ఇప్పుడు చాల దని తెలిసింది. అందువల్ల ఊళ్లోవాళ్ళందరికష్టాలూ దూర మవుతాయి. అనావృష్టి సమయంలో పొలాలకు నీళ్ళుకూడా పారించవచ్చు.

దేవోత్తరసంపద వదిలిపెట్టి మిగతాఆస్తిని రిజిష్టరు చేయ డానికి కేశవుడికి అప్పచెప్పి— "కేశవా! ఇక ముందు చరణ్ లాగా వాడిసోదరమానవులు చావకుండా చూడు. ఈభారం అంతా నెత్తిమీద వేసుకో. తప్పదు. నేను ఎప్పుడయినా తిరిగి వస్తే నాశిష్యుల్లో వాస్తవ మయినమనిషిగా ఎవ రయినా కావచ్చు. అప్పుడే నాకు దుఃఖం దూర మవుతుంది.'' అన్నాడు.

చాలారోజులనుంచీ దుర్గాదాస్ బాబు ఎప్పుడూ ఇక్కడే వుంటున్నాడు. ఆయన దీనస్వరంతో "బృందా! నీకు ఏమి చూపి నంతోషపెట్టాలో నాకు తెలియడం లేదు. అయినా ఇటు చూడు. దుఃఖాన్ని సహించడమే మానవత్వం! క్షమ, అను రాగం వదిలి సంసారత్యాగంచేయడం ఈశ్వరుని ఉద్దేశం కాదు'' అన్నాడు.

బృంద కోమలస్వరంతో "నా కాసంకల్పమే లేదు. మీదయ వల్లనన్నంతా పండిత్ జీ అంటారు. ఆసన్మానాన్ని పోగొట్టు కోలేను. ఇంకెక్కడి కయినా వెళ్ళి ఈపనే చేస్తాను'' అన్నాడు.

దుర్గాదాసు "బాగానే వుంది. నీటివసతికోసం అంతా దానం చేశావు గద. ఇం కెలా గడుస్తుంది?" అని అడిగాడు.

బృంద సిగ్గుతో నవ్వుతూ, అక్కడే తగిలించి వున్న పంచీ చూపి "వైష్ణవుల పిల్లవాడికి భిక్షానికి లోటు లేదు. రోజులు ఎలాగో గడుస్తాయి. అదీ గాక ఈసంపద అంతా చరణుడిది. ఇ దంతా వాడిస్నేహితులకోసం దానం చేశాను" అన్నాడు.

దుర్గాదాస బాబు బ్రాహ్మ డయినకూడా శ్రాద్ధదినంనాడు అక్కడే ఉన్నాడు. ఆ దేసమయంలో అతనికి కుసుమతో యథార్థపరిచయం లభించింది. ఆమెను జ్ఞాపకం చేసుకొంటూ "అది కా దబ్బాయ్. నీమాట కాదు. కోడలిమాట నే మాట్లాడేది!" అన్నాడు.

బృంద తల వొంచి "ఆమె అన్నదగ్గరే ఉంటుంది. అన్నాడు.

ఆయన బృందావనుణ్ణి కొడుకులా ప్రేమించేవాడు. అతన్ని ఆపు చేయడానికి అంతప్రయత్నం చేశాడు.

"బృందావన్, జన్మభూమిని నువ్వెందుకు వదిలెయ్యాలో చెప్పు? ఇక్కడ వుంటే అన్ని పనులూ చక్క బెట్టవచ్చు."

బృందావన్ కళ్ళునీళ్ళు నిండాయి. "నే నిక్కడ భిక్షమెత్త లేను. ఈఇంట్లో ప్రతిమూలా వాడిచేతులగుర్తులు కనిపిస్తాయి! నన్ను క్షమించండి. నేను మనిషిని! మనిషి ఇంతదుఃఖాన్ని సంభరించ లేదు.

చరణుకు చికిత్స చేసినడాక్టరుకూడా కుతూహలంకొద్దీ కలకత్తానుంచి మళ్ళీ వచ్చాడు. బృందావన్ విరాగము అతనికి అర్థ మయింది కాని ఎంతో ఔన్నత్యం పొంద వలసిన కేశవుడు

తనఉద్యోగానికి స్వస్తి చెప్పి స్వయంగా ఈచిన్న పాఠశాల భారాన్ని ఎందుకు నెత్తిన వేసుకొంటున్నాడో అతనికి అర్థంకా లేదు. విస్మితుడై స్నేహితుణ్ణి అడిగాడు: "కేశవ్, నిజంగా నేనువ్వు నీఉద్యోగం భవిష్యత్తును వదిలి ఈబల్లెలో జీవితం గడుపుతావా"

"చదువు చెప్పడమే కదా నేను చేసేపని!"

"అది నా కూడా తెలుసోయ్. కాలేజీలో ప్రొఫెసర్ పని బల్లెలో పండిత్ జీగా వుండడం రెండూ సమమేనా? ఏ ఉన్నతి కోరి ఇక్కడ వుంటావో నాకూ వినాలని వుంది!"

"చాలా, అవినాశ్ బాబూ. రూపాయలు సంపాయించ డం నిజమైన ఉన్నతీ ఒకటి కాదు."

"అది నిజం అయినా ఈ గ్రామంలో వుండడం మహా పాత కం. అబ్బా దీన్ని తలుచుకుంటేనే కష్టంగా వుంటుంది!"

బృంద నవ్వుతూ అన్నాడు "ఇది గ్రామం తప్పు కాదు డాక్టరుగారూ! మీతప్పు కాదా? ఇవాళ మీరు నాదుర్దశను చూచి వాణికి పోతున్నారు. ఇలానే ఎంతమంది చంటిపిల్లలు ఎంతమంది స్త్రీ పురుషులు చస్తున్నారో ఎవరయినా ఆలోచిం చారా? మీరు మమ్మల్ని ఇలా వదలకుండా వున్నట్టుంటే మా గతి ఇందాకా రాదు. డాక్టర్ గారూ, కోప్పడకండి మీరు తింటానికి తిండి, కట్టడానికి బట్టలూ ఏర్పాటు చేసేవాళ్ళంతా దరిద్రులై ఈగ్రామాల్లోనే వున్నారు. వాళ్ళ శవాల్నే నిచ్చె నగా చేసి మీరు ఉన్నతి పొందాలనుకుంటున్నారు. కేశవ్ చూడు: 'ఏ ప్యాసయి కూడా మీలా రెక్కే ఉన్నత మార్గం వదిలి సంతోషంగా ఉన్నాడు.'' కేశవుడు ఆనందోత్సాహాలతో

బృందావన్‌ను కౌగలించుకొని అన్నాడు. "బృందా, మనిషిని కావడానికి నాకెంత అవకాశం ఇచ్చావు! వీలయితే పదేళ్ళయ్యాక దయవుంచి ఓసారి ఇలా రా. అప్పుడు నువ్వే చూస్తావు. నీ జన్మభూమి కళకళలాడుతో వుంటుందో లేదో!"

దుర్గాదాసూ, అవినాశుడూ ఆశ్చర్యంతో మిత్రులవైపు చూస్తూ ఉండిపోయారు.

బృందావన్ యాత్రకు ముందు భగవత్సేవాభారాన్ని పురోహితుడికీ కేశవునికీ అప్పగించి, దాస దాసీలకు కూడా సరియైన ఏర్పాట్లు చేశాడు. తల్లి పెట్టెలో మిగిలిన రూపాయలు వాళ్ళకు ఇచ్చేసి పనులిచ్చి పంపాడు. కుసుమ సంగతి మాత్రమే ఆలోచించలేదు. చరణుణ్ణి ఉంచుకోడానికి నిరాకరించినప్పణ్ణించీ, ఆమె మీద అతనికి ద్వేషం కలిగింది. అందుకే అప్పటివరకూ ఆమె ఎలా వొచ్చిందో ఎందుకొచ్చిందో కూడా కనుక్కోలేదు. శ్రాద్ధం అయిపోయాక వెడుతుందని వూహించాడు. అవసరమున్నప్పుడు మాట్లాడిన మాటలుతప్ప ఇద్దరూ మళ్ళీ ముఖాముఖి చూచుకోలేదు. ఇంకా ఎక్కువ కాలం ఈ వూళ్ళో వుండే వీల్లేదు.

బృందావన్ దాసీని పిల్చి కుసుమ ఎప్పుడు వెళ్ళిపోతుందో కనుక్కురమ్మని పంపించాడు. దాసీది వెంటనే వచ్చి "వారిప్పుడు వెళ్ళరట." అన్నది. బృంద ఆశ్చర్యంతో "ఇక్కడ ఉండడానికి వీలు లేదని నువ్వెందుకు చెప్పలేదు?" అన్నాడు.

"ఆమె కన్నీ తెలుసు" అన్నది దాసీది.

బృంద, విరక్తితో "సరే, వెళ్ళి ఇక్కడ ఏకాకినిగా వుంటుం దేమో కనుక్కు రా." అన్నాడు. దాసీ చెప్పేసి తిరిగి వచ్చి— "ఉంటా రట" అన్నది. తప్పనిసరిగా బృందావన్ లోపలికి వెళ్ళాడు.

గది తలుపులు మూసి ఉన్నాయి అతనికి వాటిని తెరిచే సాహసం లేకపోయింది. అయినా నింపాదిగా వెళ్ళినాడు. లోపలి దృశ్యం చూచేసరికి అతని శరీరం రోమాంచిత మయింది. కుసుమ ఇటువేపు చూస్తున్నది! ఆత్మగ్లానివల్ల పుత్రశోకం వల్ల మనుష్యులు ఏ గతికి వస్తారో అత నిప్పుడే గ్రహించ గల్గినాడు.

("లోపలికి రండి" అంటూ కుసుమ తలుపు తీసింది. అతను రాగానే తలుపు గొళ్ళెం పెట్టి దగ్గరసా వొచ్చి నిలవ బడ్డది.) బృందావన్ ఆమెకు పిచ్చెత్తిం దేమో నని అను కొన్నాడు. ఏం చేస్తుందో నని అతని గుండెలు వణికాయి. అయినా కుసుమ ఏ అవక తవక పనీ చెయ్య లేదు. | చీరకొంగు దోపుకుంటూ భర్త పాదాల్లో తల దాచుకొన్నది. అయినా బృందావనునికి కదిలే సాహసం కూడా రాలేదు. అతని పాదాలనుంచి ఆమె నూత్నశక్తి పొందింది. చాలా సేపటికి లేచి కూర్చుని భర్తకేసి చూస్తూ కరుణాపూరిత కంఠంతో మీ రంతా సహించ గలిగా రని చెప్పుకుంటున్నారు. నే నెలా బతికేది? మిమ్మల్నీ వదిలి చచ్చిపోవడాని కయినా దా రేది?" అన్నది. ఆ సమయంలో ఇద్దరి హృదయాల్లో ఒకే ఆందోళన చెలరేగుతున్నది. బృంద

హృదయంలో ద్వేషం చల్లారిపోయింది. అతను కుసుమ చెయ్యి పట్టుకుని "నాకు లభించినట్టే నీకు శాంతి దొరుకుతుంది. వేరే దారి లేదు." అన్నాడు.

కుసుమ నిశ్శబ్దంగా ఉన్నది. బృందావన్ చెబుతో వెళ్ళి పోయాడు: "నీవు చరణును ఎంత ప్రేమించేదానివో నాకు తెలును. అందుకే ఇలా చెబుతున్నాను. వాడు పోలేదు. అందరి పిల్లల్లో వాడే ఉన్నాడు!"

కుసుమ కన్నీరు కారుస్తూ తిరిగి భర్తపాదాలు స్పృశిస్తూ "నేను కూడా మీ వెంట వస్తాను" అన్నది.

బృంద భయపడుతూ "నా వెంట? వీలు కాదు. అన్నాడు.

"బాగానే వీ లుంటుంది. నేనూ వస్తాను."

ఉత్కంఠతో ఎలా వస్తావు కుసుమా? ఏవిధంగా పోషిం చాలి? నేను నాకోసం బిచ్చ మెత్తుకుంటాను. నీకోసం నే నా పని చెయ్యలేను. అంతేకాక నీవు నడిచి ఎలావస్తావు?" అన్నాడు బృందావన్.

అవిచలితస్వరంతో చక్కగా నడవగలను. ఇక్కడికి నడిచే వచ్చానుకదూ? అంతే కాకుండా మిమ్మల్ని నేను బిచ్చ మెత్త నీయను. మీపని మీరు చేసుకోండి. నాబతుకు తెరువు నాకు తెలుసు. అన్నగారిల్లు నేనే చక్కబెడుతూ వచ్చాను అన్నది కుసుమ.

బృంద ఆలోచించాడు. కుసుమ అన్నది: ఆలోచ నెందుకు? నేను వచ్చి తీరుతాను... నిర్లక్ష్యంతో నాకొడుకును పోగొట్టు కున్నాను. భర్తనుకూడా పోగొట్టుకోడం నా కిష్టం లేదు.

బృంద ఆలోచించి "నే నేదీక్షను పొందానో నీవుకూడా దాన్నే పొందుతావా"? అని అడిగినాడు.

దృఢస్వరంతో అలాగే అన్నది కుసుమ.

బృందావన్ "మంచిది. అలా గయితే పద" అంటూ తన సమ్మతిని చూపించాడు. తరవాత కేశవుడికి భారమంతా అప్ప చెప్పి రాత్రివేళ బృందావనుడు కుసుమతో బ్రాడల గ్రామంనుంచి బయలుదేరి పోయినాడు

ఋగ్వీథి రూ 0 8

బ్రహ్మర్షి రఘుపతి వేంకటరత్న ముఖోదిత ఆంగ్లసూక్తులు

శ్రీ దేవులపల్లి కృష్ణశాస్త్రి విరచిత ఆంధ్ర పద్యములు

---

కృష్ణపక్షము-ప్రవాసము-ఊర్వశి రూ 1 8

గీతావళి రూ 0 4

నిశ్రేణి రూ 0 4

కవిచక్రవర్తి శ్రీకృష్ణ శాస్త్రి విరచితములు

---

అయిదు నాటికలు రూ 0 12

శ్రీ హరీంద్రనాథ చట్టోపాధ్యాయుని ఆంగ్ల నాటికలు

శ్రీ జనమంచి రామకృష్ణ (ఎం. ఏ) తెనిగించినది

---

శ్రీ శివ శంకర శాస్త్రి కృతులు రూ 1 0

---

గ్రంథ ప్రకాశకులు . గ్రంథ విక్రేతలు

కొత్త వారు . రాజమహేంద్రవరము

[illegible]